శ్రీ చిదంబర గ్రంధమాలా పంచదశరత్నము.



ఓమ్

# కృష్ణసందేశము

నాటకము

చిదంబర ప్రణీతము.



శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాజ సీతారామ భూపాల బహుమాన పాత్రము.

ప్రథమ ముద్రణము
1000.

స్కేప్ అండ్ కో., లో కె. సుబ్బారాయుడు గ్రబద్రునారి వలన ముద్రితము.

కాకినాడ:

1922

 [వెల రు 0-12-0.



చిదంబరకవి.

# కృతజ్ఞత.



సీ. పెకలించుచున్నాఁడు । ద్విపదనీకముల " సీ
తా " శబ్దమునకు । సార్థక్య మొదవ
గ్రహియించుచున్నాఁడు । ఘనమైన ధర్మంబు
" రామ " శబ్దమునకు । రాణ మెఱయ
సహియించుచున్నాఁడు । జనుల తప్పుల నెల్ల
" భూ " శబ్దమునకు సం । పూర్తి వెలయ
పాలించుచున్నాఁడు । ప్రజఁ జేరిన వారి
" పాల " శబ్దమునకు । మేలు గలుఁగ

గీ. కాంచుచున్నాఁడు లోక వి । ఖ్యాతి మిగుల
నట్టి గద్వాల భూపతి । కమల మతికి
ధారణీ స్థలి నాచంద్ర । తారకముగ
శ్రేయములు గల్గు నట్టు లా । శీర్వదింతు.

గ్రంథకర్త.



# ప్రకటన.

[శ్రీ చిదంబర గ్రంథమాలా.]

ఆర్యా!

ఈగ్రంథమాలలో శ్రీమన్మహీశూర మహారాజాస్థాన సుధీమణి శతావధాని చిదంబర కవి ప్రణీత సంస్కృతాంధ్ర గ్రంథములు మాత్రము ప్రచురింపఁబడుచుండు. దీనిలోఁ జందాదారులుగాఁ గోరు వారికి రు 1-0-0 కి రు 0-4-0 ల చొప్పున గ్రంథమూల్యములలోఁ దగ్గింపఁబడఁగలదు. చందాదారులు గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడెడి గ్రంథములన్నియుఁ దీసికొనవలసిన నియమముగలదు. గ్రంథములు చిదంబరగ్రంథమాలా సూచీపత్రములో సూచింపఁబడినవి. కావలసిన వారు ఒక అణాబిళ్ళ పంపినచో సూచీపత్రము పంపఁబడఁగలదు.

☛ మా విలాసము :—

శ్రీ చిదంబర గ్రంథమాలా కార్యస్థానము.

కరవది పోస్టు,

ఒంగోలు తాలూకా,

గుంటూరు జిల్లా.



# కథాసంగ్రహము.



—॥ ప్రథమాంకము. ॥—

ధర్మ భీమార్జున నకుల సహదేవులు ద్రౌపదియు ద్వారకా కృష్ణమందిరమునకు వచ్చి సంధి కొఱకుఁ గౌరవులకడకు శ్రీ కృష్ణుని బంపించుట.

—॥ ద్వితీయాంకము. ॥—

శ్రీ కృష్ణుండు కుంతీమందిరమున కేగి యామె నూరడించుట.

—॥ తృతీయాంకము. ॥—

శ్రీకృష్ణుండు విదురసదనంబున కేగి విదుర కృతోపచారంబు లొందుట.

—॥ చతుర్థాంకము. ॥—

శ్రీ కృష్ణుండు కౌరవసభ కేగి యుక్తిప్రయుక్తులచే సంధిఁ జేయఁ బ్రయత్నించి విఫలప్రయత్నుఁడగుట. విశ్వరూప ప్రదర్శనము.

—॥ పంచమాంకము. ॥—

శ్రీ కృష్ణుండు కర్ణున కేకాంతమున బోధించుట.

—॥ షష్ఠాంకము. ॥—

కుంతీదేవి కర్ణున కేకాంతమున బోధించుట.

—॥ సప్తమాంకము. ॥—

శ్రీ కృష్ణుం డుపప్లావ్యమున కేతెంచి ధర్మరాజాదులకుఁ గార్యంబు నివేదించుట.

భరతవాక్యము.



# నాటకపాత్రములు.



1. సూత్రధారుఁడు.
2. మారిషుఁడు.
3. శ్రీకృష్ణుఁడు.
4. ధర్మరాజు.
5. భీమసేనుఁడు.
6. అర్జునుఁడు.
7. నకులుఁడు.
8. సహదేవుఁడు.
9. విదురుఁడు.
10. సాత్యకి.
11. ధృతరాష్ట్రుఁడు.
12. దుర్యోధనుఁడు.
13. కర్ణుఁడు.
14. శకుని.
15. దుశ్శాసనుఁడు.
16. భీష్ముఁడు.
17. ద్రోణుఁడు.
18. కృపుఁడు.
19. నారదుఁడు.
20. కణ్వుఁడు.
21. జామదగ్న్యుఁడు.
22. గంధర్వమిథునము.
23. ద్రౌపది.
24. కుంతి.
25. గాంధారి.



ఓమ్.



# కృష్ణసందేశము.

## ప్రథమాంకము.

### నాంది

[సూత్రధారుఁడు, ప్రవేశించుచున్నాఁడు]

శా. విష్ణుం డవ్యయుఁ డాత్మ కుక్షి కుహరాన్ విఖ్యాత నానార్థ వ
ర్తిష్ణుం డాశ్రిత మానస ప్రమద వర్ధిష్ణుండు సర్వక్రియా
నిష్ణాతుండు క్షమా ధురంధరుఁడు నిర్నిద్ర ప్రభావుండు శ్రీ
కృష్ణుం డీవుత మీకు మాకు నఖిలాభీష్టంబు లశ్రాంతమున్.

[పుష్పాంజలిం జల్లి]

సామాజికుల ముఖారవిందంబులు నాడెందంబునకు మహానందంబు గలిగించుచున్నవి. నా మిత్రుండు మారిషుం డింకను రాకున్నవాఁడు (పైనఁజూచి) కాలచక్రంబు తీవ్రంబుగాఁ బ్రసరించుచున్నది.

[మారిషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మారి—భావా! నీ వేమియో? యాలోచించుచున్నట్లున్నది.

సూత్ర—మారిషా! నేఁడు మన సుకృతంబు ఫలించినది. రసజ్ఞ శిరోమణులగు నీ యభియుక్తు లంపిన యాజ్ఞాపత్రి మిదిగో.

మారి—అందుఁ గల విశేషం బేమి?

సూత్రి—(పత్రమువిప్పి) కావలసిన విశేషమే కలదు. వినుము.

శా. ఆశా బంధము లూడ లేదు రమణీ । యంబైన యుష్మత్సమా
వేశం బెన్నఁడు గల్గునో? యనుచు ను । వ్విళ్లూరుచున్నాము మీ
కౌశల్యంబు గొలంది నేఁడిచట శ్లా । ఘ్యంబైన శ్రీ కృష్ణసం
దేశం బాడి ప్రవీణులార! మము సం । తృప్తాత్ములం జేయరే ?

మారి—ధన్యులము. భావా! ఆ రూపక రత్నంబున రసజ్ఞ లోక సమారాధనంబుఁ గావించిన కవిశిరోమణి నామామృతం బించుక నా శ్రవణ పుటంబులం జిలికింపుము.

సూత్రి—శ్రోత్ర పేయంబగు తన్నామధేయంబు విననిదిగాను.

సీ. శతవధాన విధాన । చాతుర్య మెవ్వాని
ధారణా శక్తికి । దర్పణంబు
సంస్కృతాంధ్ర గ్రంథ । సంధాన మెవ్వాని
ఘన యశో రాశికిఁ । గల్పశాఖ
శమ దమాది వివేక । సౌజన్య మెవ్వాని
పరమార్థమునకు సో । పాన పథము
బహుళ రాజస్థాన । బహుమాన మెవ్వాని
మహిమాభివృద్ధికి । మంత్రశక్తి
గీ. నయ విదుండు చిదంబరా । హ్వయుఁ డతండు
ధాత్రిసురుఁడు భరద్వాజ । గోత్ర భవుఁడు
సరసులకు నెల్లఁ గర్ణర । సాయనముగ
దీని రచియించి కీర్తి । దెసల నించె.

మారి—ఓహో! శ్రీమన్మహాశూర మహారాజాస్థాన సుధీమణి యగుచిదంబర కవి కంఠీరవుండా? జగద్విఖ్యాతంబగు తన్నామధేయంబుచే నెఱుంగనిది గాదు.

సూత్రి—యోగ్యమగు సామగ్రి యంతయు విధి విధానంబున నేడింగు సమకూడినది. మన మాలస్యంబు చేయ రాదు. సదస్యుల హృదయారవిందంబులు పల్లవితంబు లగున ట్లీశరల్లక్ష్మిని వర్ణింపుము.

మారి—భావా!

గీ. స్వచ్ఛ మగు తెల్వి నొప్పు న ప్పురమునందుఁ
గప్పురపు రాశిఁ బోలు న క్షత్రగణము
తోడ వెలుఁగొందుచుండె వి ధుండు విమల
దీధితి విలాసముల నెల్ల దెసలు నిండ.

సూత్ర—ప్రస్థానమునలన శ్రీకృష్ణదేవుండు ధర్మరాజాదులతోఁ ద్వారకా మందిరంబు నాసాదించినట్లు స్ఫురించుచున్నది. మన మనంతరకరణీయంబునకు సన్నద్ధులము కావలయు. (నిష్క్రమింతురు.)

ప్రస్తావన.



—*ద్వారకా కృష్ణ మందిరము.*—

[కృష్ణ ధర్మ భీమార్జున నకులసహదేవులు క్రొవ్వదియుఁబ్రవేశింతురు.]

కృష్ణ—భావా! ధర్మజా! మీ యెల్లర కుశలామృతం బాఁ గింప నా శ్రవణ చకోరంబు లెదురు చూచుచున్నవి.

ధర్మ—దేవా! నీ కరుణా కటాక్ష ముండు నంతవఱకు మా కుశలంబున కేమి కొఱఁత ?

శా. సాహాయ్యంబగు మార్గమందు మము సంరక్షింప నష్టప్పుడా యా ధర్మంబులు దెల్ప నెంచునను సాహాయ్యంబుండి మా మానస వ్యాధుల్ వోనడఁపక శుభంబు లొనఁగూర్పక మున్న మా పాండుభూ నాథుండే నిను మాకుఁ జూపి చనెఁ గృష్ణా! దీన సంరక్షణా!

కృష్ణ—భావా! మీ పడిన కష్టంబున కిసుమంత యేని చే యూఁత నొసంగఁ జాలని నన్నేటి కింతగాఁ బ్రశంసించెదవు?

ధర్మ—వాసుదేవా! నిజ కర్మానుగతంబగు ఫలంబు నెవ్వఁడేని యనుభవించి తీరవలయు. దానికి నీ విందుఁ జేయవలసిన దేమున్నది?

ఉ. చండ పురాంతకుం డగుచు శంకరు బిచ్చపు వానిఁ జేసి బ్ర హ్మాండ నియంత యైన చతురాననుఁ గుమ్మరి వానిఁ జేసి మా ర్తాండ నిశాకరాదుల నిరంతర చారులఁ జేసి యీ జగ త్కాండము నాజ్ఞలో నిలుపు కర్మము దాఁటుట కెవ్వఁడో పెడిక.

కృష్ణ—భీమసేనా! దిగ్గజంబుం బోలు నీ కీనాఁటి కిట్టి కట్టు కంబం బేర్పడ్డు నని యెన్నఁడైనం దలంపమైతిమి సుమా.

భీమ—మాధవా! మనము తలంచిన తలంపులు నెఱవేఱునా? తలంపనవి కాకుండునా? యేది కాఁదగినదో? యది కాక మానదు.

కృష్ణ—అర్జునా! ప్రళయానిల జాజ్వల్యమానం బగు నీ గాండివంబు త్రిప్ప వలసిన కాలము సంప్రాప్తించి నందుకుఁ జింతింప వలసి వచ్చినది.

అర్జు—దేవా! పడరాని యిడుములం బడి నీకడకు వచ్చిన మమ్మూరడించుట కిట్లనుచుంటివి గాని విధివిధాన మనుల్లంఘనీయ మను సంగతి నీ వెఱుంగనిది గాదు.

కృష్ణ—అర్జునా! పూర్ణ చంద్ర బింబాబులం బురడించు నీ నకులసహదేవుల ముఖబింబంబు లెంతవాడినవో? చూచుము.

సహ—జగంబులు మాడిన వారికి మొగంబులు వాడిన నొక విస్మయమా?

కృష్ణ—చిన్నవాఁడవైనను రాజ వీర కులోచితంబగు మాంట లాడితివి భావా!

సహ—క్రియ లేని మాటల కెవ్వఁడైన నేమి?

కృష్ణ—ద్రౌపదీ! నిన్నాలోకించుచున్న కొలంది యు నా కంటికి నీరు వచ్చుచున్నదమ్మా!

ద్రౌప—అన్నయ్యా! పుట్టినింటి దీపమ వగు నీకుఁ గాక నా దుఃఖ మన్యులకేల?

కృష్ణ—అమ్మా! కొంచము దుఃఖ మడంచికొనుము.

ద్రౌప—ఆజన్మ ముండెడి దుఃఖ మడంగి కుందునా? మరల మాకొఱ కరణ్యంబు లెదురు చూచుచున్నవి సెలవిమ్మా.

కృష్ణ—అమ్మా! ద్రౌపదీ! యట్లనెద వేమి?

ద్రౌప—ఇది మీ భావగారి నిశ్చయము గాని నేననుకదిగాదు.

కృష్ణ—బావా! ధర్మనందనా! నీ యభిప్రాయ మేమి?

ధర్మ—దేవా! జనార్దనా!

కం. మిత్రులము పాత్రులము నీ
ధాత్రిల మిది ముఖ్య కార్య సమయము దుశ్చా
రిత్రులు పాండవు లని మము
ధాత్రీజను లాడకుండ దయసేయఁ గదే.

కృష్ణ—బావా! నా చేత నగు కార్యమున కభ్యంతర మేమి?

ధర్మ—దేవా! నీవు దుష్ట సంహారార్థంబు లీలా మానుష వేషముం దాల్చి యవతరించిన పరమేశ్వరుండవు నీ చరిత్రంబులు విచిత్రంబులు సకలభూతాంతర్యామివగు నీకుం జేతకానివిధానముండునే?

కృష్ణ—యుధిష్ఠిరా! ప్రాచీనుండ నగు నన్నింతగా స్తుతి చేయవలయునా? నీ యభిమతం బేమియో? చెప్పుము.

ధర్మ—వాసుదేవా! సంజయుని రాయబారమున మాతండ్రి యగు ధృతరాష్ట్రుని యభిప్రాయంబును నాతని సుతుం డగు దుర్యోధనుని యాంతర్యమును మా కేమియు నీయక వట్టిమాటలచే మమ్మూరడించునట్లు తెల్లమగుచున్నది పదు మూఁడు వత్సరంబులు పడరాని కడగండ్లం బడి దుష్కరంబగు ప్రతిజ్ఞ నెఱవేర్చుకొని కంటఁ బ్రాణంబులం బెట్టికొని మాపాలుమాకు వచ్చు నను పేరాసతో నరుదెంచిన మమ్మిట్లు నిరాశులం జేయ సనుకట్టిన నంతకన్న మా కెక్కువ విచార మేమున్నది?

క. అంధుఁడు ధృతరాష్ట్రుఁడు మో
హాంధులు దుర్యోధనాదు లది యెట్లున్నన్
బాంధవుఁడ నీవు మా కే
బంధము లేకుండఁ బ్రోచు పక్షపుము కృష్ణా!

కృష్ణ—బావా! నీ మాట ధర్మ విరుద్ధంబు కానేరదు కాని.

సీ. చాల కాలము దాఁకఁ జవికొన్న రాజ్యంబు
నీమాత్రమునకు వా రిత్తు రయ్య!
చక్రవర్తుల మంచు విక్రమించెడి వార
లోకరితో దీటుగా నుందు రయ్య!
ద్రోణ భీష్మాదులు తోడుగాఁ గలవారు
వీను మున్న వైరంబు విడుతు రయ్య!

గర్వంబుచేఁ గన్ను ׀ గానకుండెడి వారు
ధర్మంబు గాదని ׀ తలఁతు రయ్య !
గీ. ఏటి కీ యాస తుదకొక ׀ మాట వినుము
కౌరవులతోడఁ బోరు చే ׀ కూరు నయ్య !
పాపకర్ముల వధియింప ׀ వలయు నయ్య !
దండి మగ లంచు మిముఁ బే ׀ రుందు నయ్య !

సర్వసర్వంసహా రాజ్యలక్ష్మి నీ భుజామండలంబునం దాండవం బాడు కాలంబు సంప్రాప్తించినది. నీ వీ దీనవృత్తికిం బాల్పడకుము నా కిది సమ్మతము గాదు.

ధర్మ—ఎంత మాట యెంత మాట !!

మ. కులముం సర్వముఁ బాడు జేసికొని యె ׀ గ్గుం లగ్గు లేకుండ నీ యిల నే నేలిన నేలకుండినను నే ׀ మీ ? లోపమానే ? వనంబులు లేవే ? నివసింపఁ దావ నుదకం ׀ బుల్ లేవె ? కట్టంగ వల్కలముల్ లేవె? భుజింపనాకులలముల్ ׀ ప్రాప్తింపవే? మాధవా!

కృష్ణ—బావా! యింకను వేఁడుక తీర లేదా ?

ఉ. క్షత్రియులైన వీరులకు ׀ శస్త్రము జీవన మంచెఱింగియుఁ-
క్షాత్రము గల్గియుం దుదకు ׀ గౌరవలోప మొనర్తువేమి ? యీ-
చిత్రము.........................................................

ధర్మ—......మాధవా! నిజముఁ ׀ జెప్పితి నైనను నాకుఁ జూడ సి
క్షత్రియ వంశ నాశన మ ׀ సమ్మత మైనది యేమి ? చేయుదుం-

కృష్ణ—బావా ! దురాత్ముల వంశ మభివృద్ధి నొందఁ గోరుచున్నాఁడ వెంత యమాయకుఁడవు ?

భీమ—ఈ యమాయకత్వము వలనఁ గాదా ? వారి కన్ని కాళ్ళు వచ్చినవి.

కృష్ణ—ధర్మజా ! ధర్మమార్గంబు నివెఱుంగనివాఁడవు కావు.

చ. కలుగరె? నిన్నుఁ బోలు నృప | కాంతులు వారికి వైరి వర్గముల్
గలుగదె? వారికిం దగవు | గల్గదె? వారల కోడు గెల్పులుం
గలుగవె? రాజ ధర్మ మిది | గావున నేఁ జనుదెంతు సంధి కా
యలఁతులు రానిచో సమర | మంచున సందియ మొందఁ బోకుమీ.

ధర్మ—కృష్ణా! సంగర మను పలుకులు నా చెవులకు ములుకులై కలంచుచున్నవి సంధి యని వచింపుము మహాత్మా!

ఉ. కత్తులతోడ సాము బల | గంబులు రెండును నిల్చి పోర నొ
క్కొత్తున నే జయం బొదవు | నిందున నందున వీరు లెల్లరుం
జత్తురు ప్రాణ బంధువులుఁ | జత్తురు నొత్తురు భూజనంబు లా
నెత్తురు కూటి కాస గొని | నే నెటు బాల్పడు వాఁడ మాధవా!

కృష్ణ—ధర్మజా! కపట ద్యూతంబున మీ సామ్రాజ్య మెల్లం దోఁచికొని మీ రరణ్యంబున కేగు నప్పుడు కలకల నవ్వులతో దుష్ట చతుష్టయం బాడిన పలుకు లెంతలో మఱపునకు వచ్చినవి? బావా! అధర్మ వర్తను లగు వారితోఁ గలసి మెలసి వర్తింపఁ నీకు ధర్మమని తోఁచెనా?

ఉ. ద్రోహి సుయోధనుండు నయ | దూరుఁడు భాగముఁ బంచి పెట్టు స
న్నాహము సేయ నొల్లఁడని | నాకు స్ఫురించుచు నుండె నింక మీ
కాహవ ముద్భవిల్లుఁ జతు | రంగ బలంబులతోడ నీ వను
త్సాహివి గాక యుండి పని | సంగతిఁ జూడుము పోయి వచ్చెదన్.

ధర్మ—వాసుదేవా! యాహవంబున కేమిగాని? యే యుపాయంబుచేనైన నాతని నీవు శాంతింపఁ జేయవలయు.

సహ—అన్నయ్యా! నీమాటనాకతిచిత్రంబుగఁదోఁచుచున్నది.

మ. సరి వారల్ తలలెత్తి చూడ సభలో | సాధ్వీమణిన్ ద్రౌపదిన్
జెఱలం బెట్టి యనంతరంబయిన దా | నిన్ దోస మందెంచ రా

దురితాత్ముల్ కులపాంసనుల్ గఠిన చిత్తుల్ ద్రోహు లవ్వారలి
త్తఱిశాంతింతురె? మాటలన్ మనము శస్త్రంబూని పోకుండఁగన్.

కృష్ణ—నిజము నిజము. మొట్టమొదటనుండియుం బెట్టరాని యిక్కట్టులం బెట్టి క్రూర కృత్యంబుల కొడిగట్టి మిట్టిపడు ధార్తరాష్ట్రుల యెడ వట్టి మాటలచే నెట్టి కార్యముం గలుగ నేరదు.

ధర్మ—కృష్ణా! దీనికేమి? పెంచిన కొలందియు వైరంబు పెరుఁగుచుండు వైరంబువలన జనక్షయంబు సమకూరు నాకది సమ్మతముగాదు. దేవా! ముందు నీ వాకౌరవులకడ కేగి భీష్మ ద్రోణ కృపాశ్వత్థామాది ధర్మజ్ఞ శిరోమణులాకర్ణింపఁ గురుసభామధ్యంబున మా తండ్రియగు ధృతరాష్ట్ర మహీపతికి నాకు మారుగాఁ బ్రణామం బాచరించి.

సీ. కాయంబులను వాంచి నీ యానఁ బాలించి
పేరాసతో వచ్చి నార మనుము
నీ వార లని వారి భావింపకుము మేము
వారు నీ కొక తీరు వార మనుము
సంపత్తికై బంధు జనులతోఁ గయ్యంబు
నొనరింప నా మన మొప్ప దనుము
అంత కాంతకులు భీమార్జునుల్ చెలరేఁగఁ
గులనాశనంబు చేకూరు ననుము

గీ. వారి యెడ మా యెడం గాని పక్షపాతి
వర్తనము మాని మాకును వారి కెందుఁ
గలహములు లేక వర్తించు కరణి నెట్టు
లైనఁ జేయుము వృద్ధుఁడ వైతి వనుము.

కృష్ణ—బావా! నీ కట్టి మనోరథ మున్న యెడల నేను
ఁ యాన కొడంబడితి.

భీమ—వాసుదేవా! నీకు నే నొక మాట చెప్పవలసియున్నది.

ఉ. ఎన్ని మహాపచారముల నేని? యొనర్చిన ధార్తరాష్ట్రులం
దెన్నఁడుఁ గ్రూరదృష్టిఁ బడ నీయఁడు ఖండిత మాడ లేఁడు మా
యన్న ధ్రువమ్ము మే మితని యానతి దాఁటము గాన నింతకున్
గ్రన్నన నీవు పాండవులఁ గౌరవులన్ సమకూర్పు నేర్పునన్.

కృష్ణ—(చిఱునగవుతో) ఆహా !! యేమి యీ సందేశము ?

చ. సమరమునందు శాత్రవుల సత్వము నుక్కడఁగింపఁ జేయు ద
ర్పము ధృతరాష్ట్రసూతి గరువమ్ము నడంచెడి పూన్కి సర్వ రా
జ్యమును నిజాగ్రజన్మని భుజాంతర పీఠమునందు నిల్పు వి
క్రమమును నెందుఁ బోయె నవురా? నవురా? తవురా? వృకోదరా!

భీమ—కృష్ణా! లేడికిఁ గాలము వచ్చి చిక్కినది గాని కాళ్ళు
లేక చిక్కినది గాదు.

ఉ. ఈ సభ గొడ్డుపోయె నిట నెవ్వరు? పౌరుష వంతులైన స
న్యాసులు లేవ రేమి? తరుణమ్ము తొలంగుచునున్నదంచు దు
శ్శాసనుఁ డాడి నట్టి విరసంబులు పెక్కులు నాఁడునాఁటికిన్
వీసర వోక లోనిమిడి ప్రేవులఁ గోయుచు నున్న వచ్యుతా!

కృష్ణ—బావా! నీ విక్రమము నే నెఱుంగని వాఁడను గాన
కాని వన వాస క్లేశంబులం బడి తగ్గిపోయె నేమో? యని తెలిసికొనఁ
నిట్లంటి. విచారింపకుము.

అర్జు—కృష్ణా! మా తండ్రియగు ధృతరాష్ట్రుండు నిష్పక్ష
పాతంబుగఁ బ్రవర్తించెడి వాఁడు కాఁడు కాని,

మ. సగపాల్ మాకును వారికిన్ సగము రాజ్యం బిచ్చి యాతండు మా
తగవుం దీరిచెనేని? సమ్మతము లేదా? ధార్తరాష్ట్రాదు లీ
జగమం దుండ రటంచు నమ్ము మిఁక నిస్సందేహ మీ మాట

భీమ—(సంరంభముతో) .............................. మేఁ
తగురా! నేఁటికి వింటి నా చెవులఁ బార్థా! క్షత్రియోత్తేజమున్

కృష్ణ—అర్జునా! యే మింత భీషణంబు లగు భాషణంబు లుపయోగించితివి?

అర్జు—(క్రోధముతో) ఏమని చెప్పుదు?

ఉ. ఓ సతి! నిన్ను జూదమున నోడిరి నీ మగ లింక లేరు వి
శ్వాసముతోడఁ జక్కనగు వాని మెఱొక్కనిఁ గోరుకొమ్మటం
చా సభలోన సూతసుతుఁ డాడిన మాటలు నా మనంబునన్
మాసిన వంచు నెంచకుము మండుచు నున్నవి భగ్గు భగ్గునన్.

కృష్ణ—పార్థా! క్షాత్రవీర్య ప్రవర్ధితంబులగు నీప్రతాపోక్తులు నాకుం గూడ నుద్రేకంబుఁ గలిగించుచున్నవి.

నకు—నా కీ మాట లంత రుచింపకున్నవి.

ఉ. వంచనచే నసాధ్య మగు బాములఁ బెట్టిరి లక్క యిల్లు గా
ల్పించిరి సాధ్వి వస్త్ర మొలి పించిరి క్రూరులు వాని నిప్పు డి
క్లెంచిన లాభమేమి? ప్రవ హించిన నీటికిఁ గట్టఁ గట్ట యు
త్నించిన భంగిఁ గాలము గ తించిన కార్యము లేటి? కచ్యుతా!

కృష్ణ—అట్లైన నీ యభిప్రాయ మేమి?

నకు—కృష్ణా! నీవు తలంచిన సంధి కాక పోవదు.

ఉ. చేయుము సంధి ధర్మముగఁ జేయుము మాకును వారి కెంగునన్
సాయము దాని కా ఖలులు సమ్మతిఁ జూపక పోయిరేని? దు
ర్న్యాయులు సాగిరావు రణ రంగమునందున ధార్తరాష్ట్రుల
న్న్యాయముగా నశించెద రటంచు వచింపు మనాశయమ్ముగన్.

సహ—అన్నయ్యా!

ఉ. కంచెలలోనఁ దూఱు భుజ గమ్ముల కిమ్ముగఁ బాలుబోసి లా
లించిన బుస్సు మంచెగసి లేచి పయిం బడు నట్లు మంచి గా
వించెడి వారలం బరిభ వింతురు దుష్టులు వారు నేఁడు శాం
తించెద రయ్య! దండము వి ధింపక ధర్మము లెన్ని చెప్పినన్.

కృష్ణ—చిన్నవాఁడవైనను మంచి మాట చెప్పితివి సహదేవా!

సహ—మంచిదో? చెడ్డదో? నాకుఁ దోఁచిన దిది.

కం. చచ్చిరి పాండవు లనుకొను
మిచ్చకముల కేమి గాని హీనుల కడ కీ
బిచ్చమునకు నేగెడు పని
నచ్చదు నా హృదయమునకు నళిన దళాక్షా!

కృష్ణ—ద్రౌపదీ! నీ వేమనెద వమ్మా!

ద్రౌప—అన్నయ్యా! నే నింక నే మన వలయు?

మ. జననం బొందితి నేను పూజ్యమగు వంశంబందునన్ బాండు రా
జునకుం గోడలనైతి శౌర్య ధను లంచున్ బేరు గైకొన్న పా
వనులం బొందితిఁ బ్రాణనాథులఁబ్రతాప స్ఫూర్తి వెల్గొందు నం
దనులం గాంచితి నేమి లాభము? మన స్తాపంబు వేఁగయ్యెడిన్.

కృష్ణ—అమ్మా! నీ కేలోపము లేకున్నను నీలోపము మాత్రము తప్పినదిగాదు. విధివిధానమున కెవ రేమి చేయఁగలరు? విచారింపకుము.

ద్రౌప—అన్నయ్యా! నీ కన్న మఱియొక విధి యెవ్వరు?

మ. సకలోర్వీతల నాయకుల్ గనుఁగొనన్ జాల్ముండు దుశ్శాసనుం
డకటా? నా జడఁ బట్టి యీడ్చి సభలో నన్యాయ మంచైన నెం
చక వస్త్రంబులు విప్పు కాలమునఁ గృష్ణా! యంచుఁ బ్రార్థింపఁ దా
వక కారుణ్య మొకండు దప్ప నొరు లాభంగంబుఁ దప్పించిరే?

ఇంతకును నరణ్య వాసంబునం బడరాని యిడుములం బడి యజ్ఞాత వాసంబున నొకరికిఁ బానిసనై నీచులవలన నవమాన మొందియు నిన్నిఁటికి లోఁబడి చావక యింకను బ్రదికి యున్న నావంటి యభాగ్యురాలు పుట్టఁ బోదు. నా దుఃఖ మంతకంతకుం బొంగి పొరలుచున్నది దుర్మార్గుండగు దుశ్శాసనుండు నీసహోదరి నగు నాకొప్పుఁబట్టి యీడ్చి నప్పుడు తెగివచ్చిన పెన్నెఱు లివిగో (వెంట్రుకలు చేతఁబట్టుకొని) ఆ

మరాత్ముని తను వింతలింతలై తునియలుగాకున్న నామంటచల్లారునా?

కృష్ణ—ఆహా! నా సహోదరి కెంత? కష్టము ప్రాప్తించినది.

శా. అమ్మా! ద్రౌపది! యేడ్వంబోవకుము నీ స్వాంతంబునందుంచు తా
పమ్మాఱంగల కాల మిప్పటికి సంప్రాప్తించె మా సంధియ
త్నమ్ముల్ దుష్టులు వారలొప్పరను సందర్భమ్ము నిక్కమ్ము యు
ద్ధమ్మొందాపయి దద్వినాశనముఁ దథ్యంబమ్మ! వేయేటికిన్.

సోదరీ! నీకోర్కి త్వరలోఁ గొనసాగఁ గలదు.

౧. కలకాల మింక నీ వు
జ్జ్వల రాజ్య రమా విలాస వైభవములచే
వెలసెడి పాండవులం జూ
డ్కుల కింపుగఁ జూడఁగలవు కుందకు మమ్మా!

ద్రౌప—అన్నయ్యా! యీ యూరడింపు మాటల కేమి?

౨. తనకున్ మార్కొనఁడైన లేఁడని మహాదర్పంబు దీపింప భం
డనముం గోరెడి భీమసేను గద యేటన్ మ్రుంపనే? దుర్జయుం
డనటించు బ్బైఘు పార్థు గాండీవము మార్కొనన్ గాల్చునే? జన్మమం
దున దుర్యోధను పీచ్చు ధర్మజుఁడు నేర్పునన్ గాంచ లేకుండినన్.

భీమ—ఛీ! ఛీ!! నా బ్రతు కింక నేమిటికి?

. ఈ యువతీ లలామ వచియించిన మాటకు మారు మాట రా
దాయెను మంటలో నిముడదాయెను వేగము ప్రాణమైనఁబో
దాయెను నాగ్రహంబుడుగదాయెను జేతుల కడ్డమాయె ని
స్సీ? యిఁక నేటికీ గద త్యజించెదఁ ద్రుంచెద నేల ముంచెదన్.

[గద త్రిప్పి నేలం గొట్టుచున్నాఁడు.]

కృష్ణ—ఆఁగుమాఁగుము బావా!

భీమ—ఇఁక నెంత కాల మాఁగఁగలను?

ఉ. నాయకు లైన భీష్మ ముఖ । నాయకు లుండిన నిండు కొల్వులో
నీమము లేని పాపుఁ డవి । నీతి పరుండు సుయోధనుండు మా
కోమలి నెక్కుమంచుఁ దొడ । గొట్టిన నాఁటి పరాభవాగ్ని న
న్నిమెయిఁ గాల్చుచున్న దిఁక । నెన్నఁటి కీ పరితాప మాఱెడిన్.

ధర్మ—చాలుఁజాలు నీ యసమయాడంబరము లేల?

భీమ—నా గతి యంతయు నసమయాడంబరమే యైనది.

ఉ. రాజ కులంబునం బొడమి । రాజ్యము నన్యుల కొప్పగించి రా
రాజులు జూడ దైన్యమున । బ్రాహ్మణవృత్తికిఁ జొచ్చునాఁడె నా
తేజము తెల్లవాఱెఁ బఱి । తెంచెద నెచ్చటి కైన నింక నీ
యోజ భరింపఁ జాల దయ । యుంచి యనుజ్ఞ నొసంగు మగ్రజా!

ఇది కాదంటి వేని?

ఉ. మాటలు వేయు నేటి కను । మానముఁ బూనకు మేనొకండ న
చ్చోటికిఁ బోయి భూభుజులు । చూడఁగ సంగరమందుఁ జొచ్చి దోః
పాటవ మొప్ప క్షత్త్రకుల । పాంసను లైన సుయోధనాదులన్
గీటడఁగించి నీకుఁ దగు । కీరితి [illegible].

కృష్ణ—బావా! క్రియాపూర్వకంబుగా నీకు నేను తగిన సమాధానంబుఁ జెప్పెదఁ గొంచ మాఁగుము.

ధర్మ—వాసుదేవా! మా వాని మాటల కేమి?

ఉ. మమ్ము నెఱుంగు దీ వెవరి । మాయ లెఱుంగుదు వర్ధసిద్ధి భా
వమ్ము లెఱుంగు దయ్యెడలఁ । బల్కెడి పల్కు లెఱుంగు దెల్ల ధ
ర్మమ్ము లెఱుంగు దీ వెఱుఁగ । రాని దొకండును లేదు సంధి కా
ర్యమ్మున నీకుఁ దోఁచిన తెఱంగునఁ జేయుము పొమ్ము మాధవా!

దేవా! యీ భార మంతయు నీశిరంబునఁ బెట్టితిమి. ఇం దేమి? చేసినను నీవే ప్రమాణము.

కృష్ణ—ధర్మతనూభవా! వేయేల? సాధుమార్గంబున వచ్చిన నెయ్యమో? లేకున్నఁగయ్యమో? నిశ్చయించుకొని వచ్చెద.

ధర్మ—మంచిది. మధుసూదనా! మాకు మారుగా మా తల్లి యగు కుంతీ మహాదేవికి దండ ప్రణామం బాచరించి మా యోగ క్షేమంబులచే నామె నూరడింపుము.

శా. ఆ క్షుద్రాత్మకులైన కౌరవులు దుర్దుష్టాలోచనాయత్తతర్క
లాక్షా గేహమునందుఁ జిచ్చిడిన కాలంబాది మా తల్లియుర్క
బక్షుంబుల్ తెగి నట్టి పక్షి వలెఁ దిర్విన్నం దిండి స్థైర్యపచనం
గా క్షీణత్వము నొందుచున్నయది శోకవ్యాప్తి నంతంతకుర్.

కృష్ణ—మంచిది. నా కింక ముహూర్త మతిక్రమించుచున్నది.

ధర్మ—శీఘ్రమునఁ బ్రయాణము కావలయును.

(అందఱు నిష్క్రమింతురు.)

గద్య. శ్రీమత్పరమ పవిత్ర భారద్వాజస గోత్రాపస్తంబసూత్ర
యజుశ్శాఖాపాత్ర సీతారామ పుత్ర కనకంబా గర్భ
శుక్తి ముక్తాఫల పరమేశ్వర ప్రసాద సముపలబ్ధ
ఘటికాశత గ్రంథకవనసామ్రాజ్య చిదంబర
కవీంద్ర ప్రణీత శ్రీకృష్ణసందేశము.

ప్రథమాంకము.





# కృష్ణసందేశము.

ద్వితీయాంకము.

—* కుంతీ మందిరము. *—

[కుంతీదేవి ప్రవేశించుచున్నది.]

కుంతి—నా పూర్వ జన్మ దుష్కృత పరిపాకంబు నే నేమని నిందించుకొందు. అఖండ సామ్రాజ్య భోగంబు లనుభవింపం దగు నా నందనులకుఁ గానన కంద మూలంబు లనుభవించెడి కష్టంబులు సంప్రాప్తమాయెనే? తండ్రీ! ధర్మజా! నిన్ను స్మరించి నపుడైన నిష్ఠురంబగు నా పాడు హృదయంబు నీఱు గాదాయెనే? నాయనా! భీమసేనా! యేకచక్రపురంబున నాఁడు మీ రైదుగురుం దెచ్చిన భిక్షాన్నంబులో నీకర్ధాన్నముం బెట్టిన నా చేతులు నేలఁ బడకుండునే? కుమారా! యర్జునా! నీ పరాక్రమంబునకు నీ వాకరికి దాస్యముం జేసితి వని వినియుం బ్రాణంబులం బాయని నాజన్మంబు జీవచ్ఛవంబు కన్న మిన్న గాకుండునే? నాబిడ్డలు నకులసహదేవులు ధర్మమార్గంబున నన్నల కన్నను మిన్న లనుటకు సందియంబు లేదు. ఆ డింభకు లెంత వంతలం గుందు చున్నవారో? మానినీ శిరోమణి నా కోడ లాచింతావార్ధి నెట్లు తరించుచున్నదో? యింతకును నేను మహాపాపు రాల. ఈకష్టంబు లన్నియు నా ముఖంబున వినుటకు బ్రహ్మదేవుండు నాకింత పూర్ణాయువుం బోసె నాకెంత యావేగ మున్నను లోపలనే కృశింప వలసి వచ్చినది కాని నోరెత్తి కొంచము చెప్పికొనుటకు "నా" యను వారు లేరు నే నింక నెవరితోఁ జెప్పికొందు.

[నేపథ్యములో రథధ్వని]

ఏమిది? రథస్వానము వినంబడుచున్నది. నిర్భాగ్యురాల నగు నా సవిధమునకు వచ్చువారెవ్వరు? (పరికిం చి) ఓహో? నా మేనల్లుడు కృష్ణభగవానుండు వచ్చుచున్నాడు. నేడు సుదినము.

కృష్ణ—(ప్రవేశించి) అత్తా! నమస్కారము.

కుంతి—(బాష్పములతో) నాయనా! కృష్ణా! నేటికి నాకనుల గపడితివా? మీయత్త కుంతిజీవించియున్నదనియైన జ్ఞప్తిలో లేదా?

కృష్ణ—అత్తా! కాలమున కెంతటివారును గట్టుబడవలసియున్నది పూర్వజన్మ కర్మఫల మనుభవింపక తప్పదు నీవు చింతింపకుము.

కుంతి—మాధవా!

[ద్విపద]

నేను వడ్డింపఁగా । నెయ్యంబు తోడ
నానా ఫలాహార । నవ్య భోజ్యములు
భుజియించి వంది స । మూహంబు లెల్ల
భజియింప మెత్తని । పాన్పునం బండి
నిదురించి వేకువ । నియమమ్ము తోడ
మదకరి బృంహిత । మహిత సంగీత
భద్ర వాద్య విశేష । వైభవంబులను
నిద్ర మేల్కొనుచుండు । నీ బావ మఱది
లా యుగ్రవనములో । నాహార మనక
కాయంబు లవియఁగాఁ । గష్టంబు లొంది
పొదలఁ బుట్టలలోనఁ । బొరిపొరిఁ దూఱి
కదలలేకుండు సిం । గంబుల కరటి
జండ వైఖరి వ్యాఘ్ర । సంఘంబు లఱచు
చుండఁగా మేల్కొను । చుండిరే? యకట!;

కృష్ణ—అమ్మా! వార లిప్పటి కాయవస్థ లన్నియుం దొలంగి యుపప్లావ్యంబునం బ్రవేశించి యున్నవారు.

కుంతి—నా హృదయమున కిప్పటి కింత విశ్రాంతి గుదిరినది.

మ. అనఘాత్ముండగు ధర్మరాజునకుఁ గల్యాణంబొకో? భీమసే
నునకుం క్షేమమొకో? ధనంజయునకుం బ్రమోదంబొకో? మాద్రినం
దన యుగ్మమ్మునకుం సుఖావహమొకో? నా కోడలా మానినీ
జన రత్నమ్మునకుం సముత్సుకమొకో? శార్ఙీ! వచింపం గదే?

కృష్ణ—దేవీ! యెల్లరు భద్రంబున నున్న వారు కాని,

ఉ. నీదగు దీన వర్తనము నెమ్మిఁ దలంచుచు నంతకంతకుం
ఖేదము నొందుచుండెదరు నీ తనుజన్ములు నిత్య మంతియే
కాదు భవత్పదాంబుజ యుగంబున ఊన్వ్రన వ్రాలి నీ మనః
క్లేదము నార్చి పుత్త్రు మస లేచుచు నుందురు సారె కమ్మరో!

కుంతి—నాయనా! వారి కంత శ్రమ మేటికి?

ఉ. అంతటి తల్లి ద్రౌపది సభాంగణమందుఁ బరాభవార్తిచేఁ
జింతిలుచుండు నాఁడొకటి చేయుటకుం గొఱగాక నిష్ఠుర
స్వాంతముతోడ నీవలకుఁ జావక యుండిన పాపురాల నే
నెంతటి కోర్వఁ జాలనివి యెంతటి వంతలు నాకు మాధవా!

ఇది యెట్లుండినను రాచపుట్టువునంబుట్టిన నా కీపదుమూఁడేండ్లు బావకొడుకు పెట్టిన తిరిపెపుఁగూడుం దిని బ్రతికి యుండుట మాత్ర మసహ్యమై యున్నది. నేనింక నాత్మహత్యయైనం గావించు కొనియెద.

కృష్ణ—దేవీ! నీ వంతటి కృత్యంబునకు సాహసింప వలదు. నీ పుత్త్రుల నియోగంబుచే నే నీ కౌరవుల కడకు సంధి యత్నంబున విచ్చేసి యుంటి. కొలఁది కాలములోనే నీ కష్టములు గట్టెక్కఁగలవు.

కుంతి—జనార్దనా! క్షత్రియ కులంబునం బుట్టి ధర్మాధర్మంబు లెఱింగి పరాక్రమంబు గలిగి ధర్మ నందనుం డీ ముష్టికిం బాల్పడి

దైన్యంబున జీవింప నెంచె నను వార్త నేటికి నా కర్ణంబుల నాకర్ణింప వలసి వచ్చెనే ? దామోదరా ! చండతర గదాదండ మండిత భుజా మండలుం డగు భీమసేనుం డీ బిచ్చపుఁగూటికిం బాల్పడెనే ? మాధవా ! దుర్వార పరాక్రమ నిర్వర్తిత జీవనుం డగు గాండీవి నిర్వీర్యాన్నంబు భుజింప నెంచెనే ? దేవా ! లోకమాన్యుండ వగు నీ వీ కార్యంబు నిర్వర్తింపఁ బూనుకొనుట నా కన్నిటికన్న నాశ్చర్యంబుగా నున్నది. కృష్ణా! నాఁడు కౌరవులు సభా మధ్యంబున మానినీ శిరోమణి యగు ద్రౌపదికిం జేసిన పరాభవంబు మీ కెంతలో మఱపునకు వచ్చినది?

కృష్ణ.—అత్తా ! క్షత్రియ వంశంబునం బుట్టిన దానికిఁ దగిన మాటలాడితివి నా కిది కడుం గడు సంతోషంబ కాని,

గీ. ధర్మరాజను నొక భద్రదంతి నిపుడు
గలఁచి మన సేనలోనికిఁ గదియఁ ద్రోయ
నెన్ని యాలోచనలు చేయుచున్నఁ గాని
యంకుశం బింతకన్న లేదాయె నమ్మ !

కుంతి—నీ వెన్ని యుక్తు లుపయోగించినను బౌరుష దూరంబగు జన్మంబు నిరర్థకంబు కృష్ణా ! వీరమాత యను గౌరవంబునకు భాజనంబు గాని నేను గొడ్డుఁబోతురాలం గాక పోయితి నని చింతించుచున్నదాన. నాయనా ! యింతటనైన క్షత్రియ కులోచిత మగు జీవనంబున బ్రతుకుండని పాండవులకుఁ జెప్పుము.

కృష్ణ—దేవీ ! నీ నందనులు నిర్వక్ర పరాక్రమాయత్త ప్రవర్తనులు గాని స్వల్పబుద్ధులు గారు. వారు వీర జీవనంబుఁ దక్క నన్య జీవనంబు లాకాంక్షింపరు. ని వన్యథా భావింపకుము.

కుంతి—వాసుదేవా ! కౌంతేయులకుఁ దండ్రియు దైవంబును గురుండును నీకన్న నన్యంబు లేదు. నీవు శాసించు నట్లు ప్రవర్తిల్లు

వారి కాపదలు గలుగ నేరవు. కాని, నాయనా! నా విచారము మాత్రము నీ వొక పరికి నుంచికొనుము.

కృష్ణ—కుంతీ మహాదేవీ!

ఉ. సాధు కులంబునం బొడమి ♦ సచ్చరితంబున సర్వమేదినీ
నాధ సతీ మతల్లులకు ♦ నాయక రత్నమ వంచు నెందుఁ బ్రి
ఖ్యా ధను లెన్న మిన్న యగు ♦ సాధ్వివి ధన్యవు నీవు నీ మనో
వ్యాధు లడంపఁ బూనుకొని ♦ వచ్చితి నమ్మ! విచారమేటికిఁ?

కుంతి—నాయనా! నా మన స్తాప ముపశమింపఁ జేయ నీవు తలంప కున్న నాకు దిక్కెవ్వరు?

కృష్ణ—అత్తా! నీకుఁ గడ మాటఁ జెప్పెద వినుము.

ఉ. రోసము కల్మి శాత్రవుల ♦ మోసము మాపి సమస్త ధర్మ వి
న్యాస పురస్సరమ్ముగ జ ♦ నమ్ములు గొల్వ నఖండ రాజ్య సిం
హాసన మెక్కు నీ సుతుల ♦ నందఱఁ గన్నుల కింపు నింప సం
తోసముతోడఁ జూచెదవు ♦ దుఃఖము నొందఁగ నేటి కమ్మరో!

కాల మతిక్రమించుచున్నది. నే నేగ వలయు. నాకు సెలవిమ్ము.

కుంతి—మనోరథ సిద్ధియగుఁగాక పోయిరమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

గద్య. శ్రీమత్పరమ పవిత్ర భారద్వాజస గోత్రాపస్తంబసూత్ర
యజుశ్శాఖాపాత్ర సీతారామ పుత్ర కనకంబా గర్భ
శుక్తి ముక్తాఫల పరమేశ్వర ప్రసాద సముపలబ్ధ
ఘుటికాశత గ్రంథకవనసామ్రాజ్య చిదంబర
కవీంద్ర ప్రణీత శ్రీకృష్ణసందేశము.

స్వోత్రీయ నాటకము.





# కృష్ణసందేశము.

## తృతీయాంకము.

—* విష్కంభము. *—

[నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నార— (పంచచామరము.)

అమేయ భాగధేయ దర్శితాత్మ బృంహిత స్థితే!
సమస్త లోక సంస్తుత ప్రశస్త వైభవోన్నతే!
సమాహితాఖిల శ్రుతే! విముక్త భక్తి సంస్కృతే!
రమాపతే! నమామి తే నమామి తే నమామి తే.

శ్రీహరీ! శ్రీహరీ!!

భాగ్యము భాగ్య మన విదురునిదే భాగ్యము. తపో యోగ ...ర్లభుం డగు శ్రీకృష్ణభగవానుఁడు వాని కెంతలో లభించినాఁడు? ...ణ్యవంతుల కతర్కితములగు నదృష్టములు ఫలించుచుండు. భక్తులకు ...గవంతుండు విధేయుండను కింవదంతి కిది గొప్ప తార్కాణము. ...గవానుండు బంధుగృహంబులందు నైతము భుజింపక విదురసదనంబున ...రగించియున్నాఁడు. విదురుఁ డుకృతార్థుఁడనుటకు సంశయము లేదు. ...ని భాగధేయమున కంతము గానరాదు. భాగవత... లగు మహా...రుషుల కింతకన్నఁ గృతకృత్యత వేఱేమున్నది? విదురుఁ డిప్పుడు ...గవంతునకు విడెమ్ము లిచ్చి తత్పాదసేవా భాగ్య మనుభవించుచున్నా...ఁడు. సాత్యకి కూడ నాభాగ్యములోఁ బాల్గొనుచున్నవాఁడు. వారిఁ గ...ంచినాకనుదమ్ములనమృతప్రవాహంబులోనోలలాడించుకొనవలయు.

(నిష్క్రమించుచున్నాఁడు.)

—* విదురసదనము. *—

[కృష్ణుండుశయ్యపైఁగూర్చుండసాత్యకివిదురులుపాదములొత్తుచుందురు

విదు—నాకెంతటి భాగ్యము చేకూరినది ?

ఉ. ఎప్పుడు ? గారవింతుఁ గమ । లేక్షణు నెప్పుడు ? గాంతుశౌరి
నెప్పుడు ? మాటలాడుదు ను । పేంద్రునితో హరి పాద సేవ న
కెప్పుడు ? గల్గు జన్మ మిఁక । నెప్పుడు ? సార్థకమంచు నుండఁగ
నిప్పటి కబ్బె నన్నియును । నే నొనరించిన పుణ్య మెట్టిదో ?

దేవా ! దరిద్రుండనగు నేనొసంగిన పత్ర పుష్ప ఫల తోయ
ములకు నీ వంగీకరించుట వలన నేటికి నా జన్మము కృతకృత్య మైన

కృష్ణ—విదురా ! నిర్మలంబగు హృదయంబున ధర్మమార్గమ
దప్పని భిక్షుకుండేనియుఁ దృణం బిచ్చినను నాకది మేరు ధరాధరం
కన్న మిన్న యగుచుండు. ధర్మ నీతి బాహ్యంబగు చిత్తంబున
మండలాధిపతియేనియుఁ గాంచనాచలంబర్పించినను నా కది గడ్డిపో
కన్న నీచంబుగాఁ దోఁచుచుండు. నాయనా ! నీ భక్తిభావంబున
బరమ ప్రీతుండనైతి. నీవు నా కింతకన్న నీయవలసిన దేమున్నది ?

విదు—అనుగ్రహ మనుగ్రహము.

కృష్ణ—విదురా ! నిన్నొకటి ప్రశ్నింప వలసియున్నది.

విదు—దేవా ! నా శ్రవణచకోరంబులు భవద్వాగమృతంబ
కెదురు జూచుచున్నవి.

కృష్ణ—నే నిప్పుడు కౌరవ పాండవుల కెట్లని ? సంధి
కూర్చు యత్నంబున నిచ్చటికి రావలసి వచ్చినది కాని, కౌర
ప్రాయము మాత్రము నీవు తెలుపవలసి యున్నది,

విదు—కృష్ణా ! సర్వజ్ఞుండవు నీవీకార్యంబున కింత దూ
వచ్చితివనిననాకత్యాశ్చర్యమగుచున్నది. దుర్బుద్ధియగు దుర్యోధన
పరమహితబోధకంబగు నీవాక్యములం గల తాత్పర్యంబు గమనిఁ

వాఁడు కాఁడు. ద్రోణభీష్మాదులసాహాయ్యంబు తనకు విజయదాయకం బనియు నంమనను కర్ణుండొకండు తప్పక జయంబు నాపాదించుననియు విజృంభించుచున్న వాఁడు. ధార్తరాష్ట్రుల నిశ్చయం బెఱింగిచెద వినుము.

ఉ. నీవెఱిఁగించు మాట గమ । నింపరు పాండవ దాయ భాగముల్
భావమునం దలంపరు ర । వంతయు ధాత్రి నొసంగ రాపయిన్
జేవ కొలంది సంగరముఁ । జేసి జయింతుము చత్తు మింతియే
కావలె నన్య మొల్లమను । కల్పము సిద్ధము చేసి రచ్యుతా!

కృష్ణ—దుర్మార్గు లెంత కార్యము తలపెట్టిరి?

విదు—దేవా! కర్ణ శకుని దుశ్శాసనుల ప్రోత్సాహంబున దుర్యోధనుండు కన్ను గానకున్న వాఁడు. పొందు పొసంగనేరదు. వారి కండకావరం గాల మాసన్నమైనది. స్వామీ! నీవాదురాత్ముల నడుమఁ గూర్చుండి మంచిమాట చెవిఁదూఱని యావంచకులకుచెడి దురుక్తులకు సమాధాన మిచ్చుటయు ననర్థం బని నాకుఁ దోఁచుచున్నది. ధర్మాధర్మము లెఱుంగని యాదుర్మతులు నీ కార్యవచనంబుల తెఱం గెఱుంగ నేరరు. మూఢచిత్తులగు నామదమత్తులు నీభీషణంబులగు భాషణంబులకు జంకరు. యుక్తాయుక్తవివేకశూన్యులు నీ మాటలకుఁ బరిహాసంబుఁ గావింతురు. కృష్ణా! యివి యన్నియు నీ వెఱుఁగనివాఁడవు కావు. కాని నీయందు నాకుఁగల భక్తిభావంబు నన్నిట్లనిపించుచున్నయది. దేవా! నీ వచ్చుటకిఁ బోవలదు. నా మనవి నంగీకరింపుము.

కృష్ణ—విదురా! నీవుచెప్పిన నీతివాక్యంబులు శ్లాఘనీయంబు లనుటకు సందియములేదు. కాని, మదాగమన ప్రకారం బించుక విని నీవెట్లు చెప్పిన నేనట్లుచేయుటకు సంసిద్ధుండనగుచున్న వాఁడ. దురాగ్రహావిష్టులగు ధార్తరాష్ట్రులతోడ సంధి పొసంగదని నే నెఱుంగనిదికాదు.

గీ. బాంధవులలోనఁ గలహంబు । ప్రబలినపుడు
వారితోడ విరోధంబుఁ । బడసియైన
వైర మాఁపఁదలంపని । వాఁడు క్రూర
కర్ముఁడని పల్కుచుందురు । ధర్మవిదులు.

కావున నే నీ యుభయ పక్షంబులకు హితంబు సేయఁ బ్రియ త్నింపవలసివచ్చినది. నాకుఁదోఁచిన తెఱంగునఁగౌరవసభామధ్యంబునఁ జెప్పఁదగిన ధర్మముం జెప్పెద. వారునన్నుఁ బాండవపక్షుంబు వానిఁగా నూహించి నా మాట తిరస్కరించిరేని తత్ఫలం బనుభవింపఁగలరు.

ఉ. అన్నలుఁ దమ్ములుం దగవు ♦ లాడుచునుండ నుపేక్షఁ జేసె ని
వెన్నఁడటంచు నజ్ఞులవి ♦ వేకమునం వచియింతు రేటికీ
చిన్నతనంబు నాకు నృప ♦ శేఖరు లెల్ల వినంగఁ గార్యమం
దున్న తెఱంగుఁ దెల్పెద న ♦ నూన సభా భవనాంగణంబునం.

దానికి వా రియ్యకొనిరేని బ్రతుకుదురు. లేక నీవు చెప్పినట్లు తులువతనంబునం బ్రవర్తించిరేని చెడిపోవుదురు. నాకు లోపమేమి?

విదు—స్వామీ! నీకార్యకౌశలం బతిమనోహరముగానున్నది. నే నిప్పుడా కౌరవసభాంతరంబున కేగి యుష్మదాగమనం బెఱింగించెద.

కృష్ణ—మంచిది. నీవుముందేగుము మేముగూడవచ్చుచున్నారము.

విదు—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

కృష్ణ—సాత్యకీ! ధర్మోత్తరమగు విదురునివాక్యమువింటివా?

సాత్య—కృష్ణా! భవద్భజన శీలుండగు సుశీలునకు ధర్మమార్గంబు కన్న నన్యమార్గంబు రుచించునే?

కృష్ణ—తమ్ముఁడా! దుర్బుద్ధియగు నా దుర్యోధనుండు మన మాటల కియ్యకొనకున్నను.

ఉ. ద్రోణుఁడు చెప్పఁడే తనకుఁ ♦ దోఁచిన ధర్మము భీష్ముఁడాడఁడే?
బాణమువంటి పల్కులు కృ ♦ పాదయుఁడైన కృపుండు దెల్పఁడే?
ప్రాణము లేల? గోల్పడెదు ♦ భాగముఁ బంచు మటంచు నింకనుం
శ్రేణులు గట్టి యుండు నృప ♦ శేఖరులెల్ల వచింపకుందురే?

సాత్య—చెప్ప కేమి? యధర్మమునకు గడ్డి తినువారెవ్వరుందురు?

కృష్ణ—తమ్ముఁడా! మనము గూడఁద్వరగా నచ్చటి కేగవలయు.

నిష్క్రమింతురు.





# కృష్ణసందేశము.

## ప్రథమాంకము.

### —కౌరవసభ—

ధృత:—తమ్ముఁడా! శ్రీకృష్ణునకుఁ గనక మణి మయంబు లగు రథంబులు జవనాశ్వంబులు భద్రగజంబులు మున్నగు నుపాయనములచే సంప్రీతిఁ గలిగింప వలయు.

విదు—అన్నా! పూర్వపుణ్య తపో గోచరుండగు శ్రీమన్నారాయణుని సంప్రీతుం జేయుట సముచితంబ కాని పాండవులకుఁ దుద నైదూళ్ళయిన నొసంగ సమ్మతింపని నీ కింతలో నింత త్యాగగుణ ముద్భవించినందు కెంతయు వింత యగుచున్నది.

ధృత—తమ్ముఁడా! పాండవుల కైదూళ్ళిచ్చుట కేమి? భాగ మిచ్చుట కేమి? నేను సమర్థుండ నగుదునో? కాదో? నిజ మెఱుంగుదువు.

విదు—ఇప్పుడీకృష్ణున కిచ్చుటకు సమర్థుండ వైతివా?

ఉ. లంచ మొసంగి శౌరికిఁ దలంచిన కార్యము నెట్టులేని భే
దించుట కీయుపాయము ప్రశస్తతమైనది గాని యొండుకీ
వంచన బుద్ధి పాండవులఁ బాయుమనె మేరు ధరాధరంబు న
ర్పించినఁ గాని మాధవుఁడు బేలవు నీ విది గుర్తెఱుంగవే.

ఏటికీ వ్యర్థ ప్రయత్నములు సకలాంతర్యామియగు నా దేవదేవు సంతసింపం జేయ నర్ఘ్యపాద్యములు కుశలప్రశ్నలుం దక్క వేరొక్క యుపాయంబు లేదు.

దుర్యో—ఆర్యా! మంచి మాట జెప్పితివి. కృష్ణుఁ డేవిధముచే నయినఁ బాండవుల నెడఁబాయు ననుమాట దుర్ఘటము.

మన మేమేని యుపహారంబు లీసమయంబున నాతని కర్పించినఁ గౌరవులు బెదరి రని లోకు లపహసింతు రని కూడ నా నిశ్చయము.

భీష్మ—ధృతరాష్ట్రా! జగదంత ర్యామియగు నా పుండరీకాక్షుండు నీ విచ్చిన నొకటిగను నీయకున్న వేరొకటిగను దలంచువాఁడు గాఁడు. ఇంతకును మన కడ కాభగవంతుఁడు దేనికి విచ్చేయుచున్నాఁడో? యీ పనిం జక్కఁజేసి పనుపుటయే కురు వంశమున కెల్లఁ బరమ హితంబు.

దుర్యో—తాతా! కృష్ణుఁ డేమి చెప్పినను నీ యాన చొప్పున నేను దాని కొడంబడుదుఁగాని పాండవుల కిమ్మేదినిలో నేమిమ్మనినను దానికి మాత్రము సమ్మతించెడు వాఁడను గాను.

భీష్మ—సమ్మతింపక నీవు చేయఁ దలచిన దేమి?

దుర్యో—కర్తవ్యముఁ జెప్పవలయునా?

ఉ. ఇమ్మెయి వట్టి మాట లిఁక నేటికిఁ బాండవదుష్కరావలం
బమ్మగు వానిఁ గట్టి పడ వైచితి మేని పయిన్ సమస్త కా
ర్యములు దీరు నంచొక యుపాయముఁ బన్నితి మేము మీరాయభీ
ష్టమ్ములు దెల్పుఁడీ రిపుల సంహననమ్మునకున్ దలంపుఁడీ.

భీష్మ—ఓరీ దుర్మతీ! యెంత జగద్ద్రోహం బాలోచించితివిరా జగత్సాక్షియగు నా గోవిందుని మాహాత్మ్యం బెంత వారికిని గుర్తెఱుంగ దుర్లభము. నీ వీ పిచ్చి సేఁతలకుం గడంగి చెడి పోకుము.

విదు—కురు కుల క్షయంబున కీ యుపాయమే ప్రథమ కబళంబుగాఁ దోఁచుచున్నది. దుర్యోధనా! నీ వీకొఱగాములం బడి యుక్తాయుక్తవిచార శూన్యుండ వగుచున్నాఁడవు. కులనిర్మూలంబున కిట్టి దుర్బుద్ధు లుద్భవిల్లుచున్నవి. నీ చేటు నీ వెఱుంగక పాటుపడకుము. అఖిలబ్రహ్మాండ భాండ మండితోదరుండగు నా పుండరీకాక్షుండు సామాన్య నరుఁ డని తలంపకుము. అతండు కన్ను తెఱచిన లోకంబు లన్నియు భస్మీభూతంబులు కాఁగలవు.

ద్రోణ—ధృతరాష్ట్రా! నీ పుత్రుఁడు ప్రాణాంతకంబగు కార్యంబు చేయఁదలంచియున్నాఁడు. సర్వజగన్నియంత యగు నా యనంతునియెడ నపచారముం దలంచిన దుష్టాత్ములు పుత్ర మిత్ర కళత్ర పరివార సహితంబుగా నష్టాత్ములగుదురు. నే నింతకన్నఁ జెప్పవలసినది లేదు.

ధృత—సుయోధనా! భగవంతున కపచారముం దలపెట్టినఁ గీడువాటిల్లుననుటకు సందియము లేదు. దుష్టాత్ముల సహవాసంబునం జేసి నీకీదుర్బుద్ధులుదయించుచున్నవి. తండ్రీ! నీవీదుర్వృత్తులకుఁ బాల్పడకుము

విదు—(శ్రవణమభినయించి) శ్రీకృష్ణభగవానులు సాత్యకితోడ విచ్చేయుచున్నట్లున్నది.

ధృత—నాయనా! వారికి మనమెదురేగితోడ్కొనిరావలయు.

(అందఱు లేచిపరిక్రమింతురు.)

[కృష్ణసాత్యకులు ప్రవేశింతురు.]

ధృత—శ్రీకృష్ణభగవానునకు స్వాగతము.

కృష్ణ—యుష్మదాశీర్వచనము వలన.

భీష్మ—కృష్ణా! భవత్సందర్శనంబువలనఁ గృతార్థులమైతిమి.

కృష్ణ—తాతా! మీకు నాయందుండు వాత్సల్య మిట్లనిపించుచున్నది.

ద్రోణ—వాత్సల్య మనకుము నాయనా! మాహాత్మ్య మనుము.

కృష్ణ—ఆచార్యా! యుష్మదనుగ్రహ వ్యతిరిక్తమగు మాహాత్మ్య మేమున్నది?

కృప—మహాత్ముల చిత్తవృత్తుల కిదియే తార్కాణము.

విదు—దేవా! యీ యాసనం బధిష్ఠింపుము.

కృష్ణ—(పైనఁజూచి) అదిగో మహర్షు లెవరో? మనకడ కరుదెంచుచున్నవారు. వారినర్చింపక మనముకూర్చుండ భావ్యముగాదు.

[అంతరిక్షమునుండి కణ్వ నారద జామదగ్న్యులు ప్రవేశింతురు.]

కృష్ణ—మహాత్ములకుఁ బ్రణామము.

మహ—కళ్యాణమ్ కళ్యాణమ్.

విదు—మహర్షు లీపీఠంబు లధిష్ఠింపవలయు.

మహ—సాధు సాధు (కూర్చుందురు.)

కృష్ణ—మామా! మీరందఱు విశ్రమింపవలయు.

ధృత—నాయనా! నీవు కూర్చుండుము.

[అందఱుకూర్చుందురు]

కృష్ణ—మామా! ధృతరాష్ట్ర మహీపతీ! భరత కుల భూషణుండ వగు నీకుఁ దెలియని ధర్మ ముండదు. కాని బంధు కులోపద్రవంబు ప్రాప్తించెడి కాలంబున హితుండగు వాఁడు తనకుఁ దోఁచిన మంచి మాట చెప్పవలయు నను నార్యోక్తిం బ్రమాణీకరించుకొని నే నింత దూరము రావలసి వచ్చినది.

ధృత—కృష్ణా! నీ వీకార్యభారంబుఁ దాల్చి యింత దూరము వచ్చినందు కెంతయు సంతసమగుచున్నది.

కృష్ణ—మామా! ఒకరికిఁ జెప్ప నేర్చిన కుల వృద్ధుండవు నీకుఁ బరులు చెప్ప వలసినది యేమున్నది?

ఉ. పెద్దవు నీవు నీ కులము పెద్దది యన్నిటిలోన నీ సుతుల్
తద్దయు సద్గుణోత్తములు తమ్ముఁడు ధర్మవిదుండు నీకు నే
రెద్దియుఁ జెప్ప నేమిటికి నీవ యెఱుంగుదు సన్నిహితాత్మ నీ
బుద్ధికొలందిఁ బాండవులఁ బ్రాజ్ఞ మనోరథులం బొనర్పుమా.

ధృత—మంచి మాట చెప్పితివి నేనిందేమియు ననుటకు వీలు లేకున్నది. అంధుండనగు నాపై నింత భారము మోపఁదగదు నాయనా!

కృష్ణ—మామా! నీ వంధుండవైన నేమి? దివ్యాంజన బంధురంబగు నీ జ్ఞానగంధంబు చాలదే?

ధృత—నాయనా! నాకే ష్ట నగింధంబున్న నేమి లాభము? నా బ్రతుకంతయుఁ బరాధీనంబయి యున్నయది.

కృష్ణ—మామా! యీ మాటల కేమి? నీవు నిష్కల్మష హృదయంబునఁ గౌరవపాండవులకుఁ గలహంబులు పుట్టకుండఁ దలంచిన నీ కార్యము సాధ్యము కాక పోవునే?

ఉ. పెంచితి వాత్మజన్ములని పెద్దలఁ జేసితి వింతదాఁకఁ బో
షించితి పాండుపుత్త్రుల నశేష జనంబులు మెచ్చ నింతలోఁ
జంచలమయ్యె బుద్ధి కొనసాగునె కాఁపుర మిట్టులైన యో
చించి వచింపు మీ విబుధశేఖరు లెల్లరు మేలు మేలనన్.

ధృత—నాయనా! కృష్ణా! మా వంశంబునఁ దండ్రి మనోరథంబులు నెఱవేర్చు పుత్త్రి దర్మంబులు మా భీష్మునితోడనే సరి. నే నిందేమి చేయవలయునో? చెప్పుము.

కృష్ణ—మామా! వయోధర్మజ్యేష్ఠుండవగు నీకుఁ జెప్పవలెనా.

ఉ. పంచుము రాజ్యభాగములు వారికి వీరికి నన్యాయ యుక్తియో
దంచితమైన కార్యమున ధర్మ మధర్మము గుర్తెఱింగి వ
ర్తించెడి నీ వుపేక్ష యొనరించిన ముందఱఁ బుట్టు కీడు నీ
కొంచెపు బుద్ధి కల్మి నొనఁ గూడిన దంగు రెఱుంగకుందువే.

మామా! కౌరవ పాండవులలో నెవ్వరి కేయపాయము వాటిల్లినను నీ స్వాంతమునకు సంతాప ముదయింపక పోదు. పాండవులందు భీమార్జునులకును గౌరవులందు భీష్మద్రోణులకును యుద్ధరంగమం దెదిరించి నిలువఁగలవారెవ్వరు? వ్యక్తముగా నిన్నుభయకులముల నందఱను సంగ్రామంబున నిహతాత్ములఁ జేయుటకంటె నీ రెండుతెగలకు నాయకుఁడ వగుట శ్రేయము కాదా?

ధృత—నాకేమియుఁ దోఁచకున్నది.

కృష్ణ—మామా ! పాండుకుమారులు భక్తిభావంబుననీకుఁ బ్రణామపురస్సరంబుగా విన్నవింపుమని చెప్పిన విధంబు వినుము.

సీ. ద్వాదశాబ్దంబులు ॥ వనభూములకు మేను
లొప్పగించితి మంచుఁ ॥ జెప్పు మనిరి
ఆజ్ఞచే నొక్క యేఁ ॥ డజ్ఞాతవాసంబుఁ
జేసి వచ్చితి మంచుఁ ॥ జెప్పు మనిరి
క్రమమైన మా యర్ధ ॥ రాజ్యమ్మునకు నిరీ
క్షించి యున్నా మంచుఁ ॥ జెప్పు మనిరి
తండ్రియుఁ జుట్టంబు ॥ దైవంబు నీవ మా
కెప్పుడైన నటంచుఁ ॥ జెప్పు మనిరి

గీ కులము పెద్దవు నీవు మా ॥ వలన నేమి
తప్పు లుండినఁ దగు బుద్ధిఁ ॥ జెప్పు మనిరి
కీడు మేళ్ళకుఁ బాల్పడు ॥ వాఁడ విందుఁ
జివర కగుదువు నీ వంచుఁ ॥ జెప్పు మనిరి.

మామా! లోభాక్రాంతంబగునీస్వాంతంబుం జక్కఁజేసికొని వారి తండ్రి పాలు వారి కొసంగి నీ పాలు పుత్ర మిత్ర కళత్ర పరివార సమేతంబుగా నీ వనుభవింపుము. నాకు వారును వీరును నొక తీరు వారగుటం జేసి ధర్మముం జెప్పితి.

ఉ. పావనమైన సత్య మెడఁ ॥ బాసి వివేకము నీటఁ ద్రోచి దు
ర్భావముఁలందుఁ జిక్కి మన ॥ పల్కిన కష్టములే దటం చధ
ర్మావహ వృత్తితోడ నరు ॥ లందెవ రేమి యొనర్పఁ జూచినన్
దైవము మాత్ర మెప్పటికి ॥ ధర్మపథంబున నిల్చి యుండెడిన్.

మహా—సత్యము సత్యము.

ధృత—కృష్ణా! నీవు చెప్పిన దంతయు యథార్థము గాని నాకా భాగ్యము లభించునా?

కృష్ణ—పురుష ప్రయత్నము వలన సాధ్యముగాని దుండదు.

ధృత—నాయనా! హృదయమం దుండిన దైవము నడిపించి నట్లు మనము నడుచు చుందుము గాని మన కెందేనియు స్వాతంత్ర్యము లే దని నా నిశ్చయము.

కృష్ణ—నీ నిశ్చయమున కేమి? పురుషుఁడు సర్వస్వతంత్రుఁ డని తెలిసికొనుము.

ధృత—విచారింపవలయు.

కృష్ణ—ఎంత కాల మిూ విచారము?

ఉ. సమ్మదవృత్తిఁ బూనిన పరి శాంతులు శూరులు వారు తత్పదా
బ్జమ్ములు నమ్మి కొల్చెదరు చక్కఁగ దానికి నొప్ప వేని యు
ద్ధమ్మున కేగు డెంచెదరు తక్కిన మాటల కేమి రెండు ప
క్షమ్ములలోన నీ మదికి సమ్మత మెయ్యది నిశ్చయింపుమా.

దుర్యో—మాధవా! నీవు చెప్పిన యుభయ పక్షంబులలో మాకు రెండవ పక్షంబు తప్ప వేరొక పక్షంబు రుచింపదు.

కృష్ణ—నిన్నడుగ లేదు.

దుశ్శా—నీకుఁ జెప్ప లేదు.

భీష్మ—దుశ్శాసనా! నీ ప్రతాప మింకఁ జాలు.

ధృత—సుయోధనా! మన కెల్లఁ బరమాప్తుఁడగు నీగోవిందుని మాట కెదురాడకుము నాయనా!

దుర్యో—నీవలె నీళ్ళు నమలుటకు నా చేతఁగాదు.

ధృత—చేతఁగాక నీవు చేయునది యేమి?

దుర్యో—చేయఁ గలిగినదియే చేయుదుము.

ధృత—అయ్యయో; నీ యూహ కౌరవ వ్యూహంబునకు దాహకంబని నిశ్చయించుకొనుము. దుర్మతుల నమ్ముకొని నీ వాహవ ప్రవాహంబున దూఁకఁగడంగితివి. నీ కిది శ్రేయముగాదు. భావ్యనర్థంబు లాలోచించి వ్యవహరించికొనుము. నే నింతగా శిక్షించుటకు నీవు బాలుండవు గావు. నామాట వినుము నాయనా!

పాండవులందఱు గాదు నలగేపాల కెభూమము లుండు సమస్త
మండలమందు నాకెదిరి గేమార్కొను వాఁడెవఁడో వచింపుమా.

ఆత్మప్రతాప ప్రకటనంబునకు ముందంజవేయు నందాఁక నీ వూరకొను వాఁడవు కావు.

జాపు—దుర్యోధనా! మున్ను దంభోద్భవుండను రాజు తన కెదురు లేదను గర్వంబుఁ గన్నుఁగానక గంధమాదన పర్వతంబునఁ దపంబుఁ జేసి కొనుచుండు నరనారాయణు లను మునీంద్రుల పైకి దండెత్తిపోయి వారి వలన మాన భంగంబు నొందె. ఆమహానుభావు లిపుడు పార్థుండనియుఁ గృష్ణుండనియు నవతరించిరి. కాన వీరి యెడ నీ గర్వంబు పనిసేయ నొల్లదు. తుదకాదంభోద్భవుని చందంబున మాన భంగంబు నొందెదవు. వత్సా! నీ హితోపదేశమున కొడంబడి చిరంజీవి వగుము.

కణ్వ—దుర్యోధనా! మున్ను దేవేంద్రుని సారధియగు మాతలి తన పుత్రిక గుణకేశియను కన్య నార్యకుండను భుజంగాధిపతి మనుమండగు సుముఖున కీయఁ గోరి పాతాళమున కేగి యా వృత్తాంతం బార్యకున కెఱింగింప నాతండు నాయనా! గరుత్మంతుం డతని తండ్రిం జంపి వీనిం గూడ నొక మాసంబులో సమయించెద నని ప్రతిజ్ఞ వట్టిపోయి యున్నాఁడు. నేఁడో? రేపో? చచ్చి పోయెడి వానికి వివాహం బేటికని భోరున నేడ్చి నంత మాతలి వాని నోదార్చి సుముఖుం దోడ్కొని యుపేంద్రుల కడ కేతెంచి వారి పాదంబులపైఁ బడవైచె. అంత నుపేంద్రాజ్ఞానుసారంబుగా నింద్రుం డా సుముఖునకు దీర్ఘాయు వొసంగిన నామాతలి తన కన్య నాతని కిచ్చి వివాహంబు గావించె. అది విని గరుత్మంతుండు క్రోధావేశంబున నింద్రుని కడకు వచ్చి యింద్రా! నా యధికారం బెఱుంగక నీవు నాకెంత యపచారం బాచరించితివి? నీవంతెంత యు నా యొక్క ఱెక్కచే నెగరఁజిమ్మెద

జూడు మని విజృంభించె. అప్పుడు పుండరీకాక్షుండు చిఱునవ్వుతో వైనతేయా! నీ వెంతబలశాలి వని యాతని వీఁపునఁ జేయి వెట్టినంతఁ దార్క్ష్యుండు నోరు తెఱచి రోఁజుచుఁ బడుచు లేచుచుఁ బ్రాణంబులు పోయె నని పెద్దపెట్టు నేడ్చె. అప్పుడు దయాళువగు నారాయణుండు నీకు వచ్చిన భయము లేదని లేవ నెత్తి యింక నిట్టి గర్వంబు మాని బుద్ధి గలిగి యుండు మని చెప్పి పంపె. కావున నెప్పటికిని దురభిమానంబు దుర్దశ నాపాదించు. నీ వీమహానుభావుని మాట కెదురు మాటాడకుము సుఖించెదవు. లేదా? చెడెదవు.

నార—(స్వ) ఈ దుర్మతి కెంత చెప్పినను మా మాటలు చెవి కెక్క వను మాట సిద్ధాంతము. నా ప్రాశనంబున కేమియుం గొఱంత రా నేరదు. తోఁచిన మాట నలుగురి యెదుటఁ జెప్పక నేను మాత్ర మేల చెడ్డవాఁడను గావలయు (ప్ర) దుర్యోధనా! గాలవుండను నొక ప్రబుద్ధుఁడు విశ్వామిత్రుని కడ విద్యాభ్యాసంబు గావించి గురుదక్షిణ సమర్పింప వలయునని తలంచి విశ్వామిత్రునడుగ నాతండు నా కేమియు వల దనినఁ బట్టుఁ బట్టి దురభిమానంబునఁ గోరిన దెల్లఁ దెచ్చియిచ్చెదఁ గోరు మని నిర్బంధించె. అంత నాతండు ధవళవర్ణంబులై యొక్క కర్ణంబు నల్లగా నుండు నుత్తమాశ్వంబు లెనమన్నూఱు తెచ్చి యిమ్మనిన నాతండు మంచిదని పోయి నిద్రాహారంబులు లేక తిరిగి తిరిగి యట్టి గుఱ్ఱంబు లెందుం జిక్కకునికిఁ జింతిల్లుచు మరల విశ్వామిత్రుని మొగముఁ జూచుటకు లజ్జ పడుచుఁ దన మాట చెల్లింపకున్న నాతండు శపించునేమో? యని భీతిల్లుచ మొదట దురభిమానంబునఁ దానొనర్చిన నిర్బంధమునకు దురపిల్లుచ నేమి చేయుటకుం గాలాడక యాత్మహత్యకు సిద్ధపడియుండు నం నాతని బాల్యమిత్రుండగు గరుత్మంతుండు వచ్చి వానిం దోడ్కొ విశ్వామిత్రుని కడకేగి స్వామీ! యీతండు ముగ్ధుండు దయాళుం

వగు నీ పీతని ననుగ్రహింప వలయు నని పార్థింప నావిశ్వామిత్రుండు వానిగర్వంబునకుఁ దగిన బుద్ధిఁజెప్పి పంపించె. కావునఁ బెద్దలమాటలు వినకున్న నా గాలవునకుఁ గలిగిన పరాభవము నీకుఁ జేకూరఁ గలదు ధర్మంబు నిలిచినట్లు గర్వం బెన్నఁడును నిలువఁజాలదు నీవధర్మమునకుం బాల్పడకకృష్ణభగవానుండు చెప్పినట్లు పాండవులతోఁ గలసిమెలఁగుము

దుర్యో—[నవ్వి] కర్ణా! మనకు బుద్ధులు చెప్పవచ్చినారు వీ రెంత? వెఱ్ఱి మానుసులోఁ చూచితివా?

కర్ణ—అందుకు సందియ మేమున్నది? తగినప్రత్యుత్తరమిమ్ము.

దుర్యో—మునులారా! యజ్ఞకుండంబులందు వినియోగింపఁ దగిన మీ వైదికవచనంబులు మా వ్యవహారములకుఁ బనికిరావు మీ కింత శ్రమ మక్కఱలేదు.

దుశ్శా—అన్నా! ఆ మాట విస్పష్టముగాఁ జెప్పుము.

మ. తడబాటుం బడనేల వ్యర్థముగఁ జిత్తం బల్లకల్లోల మ
వ్వేడు నట్లాడెడు గడ్డమయ్యలకు మా కేరికుండ నీ విట్లు వె
న్కఁడుగుల్ వేయఁగ నేల పాండవులనే కాదీజగం బెల్ల నొ
క్కఁడ నేఁ జాలుదు నుక్కడంచుటకు నిం కర్ణ జంకు నీ కేటికిన్.

ద్రోణ—దుశ్శాసనా! నీ సామర్థ్యము మే మెఱుంగని వారము కాము. కొంచ మాఁగుము. నాయనా! సుయోధనా! మీ యందు నాకుండు వాత్సల్యముం బట్టి నే నొక్కింత చెప్పవలసి వచ్చినది నామాట వినుము. ఈ మహాత్ముల భాషణంబు లన్నియు నీకు క్షేమంకరంబులు. త్రికాలజ్ఞులగు నీమహర్షిసార్వభౌములు మనుష్యమాత్రు లనుకొనకుము. కృష్ణార్జునరూపంబుల నవతరించిన నరనారాయణులతో నీక కాదీలోకంబున నెంతటివారికిని విరోధంబు గూడదు. దాన నిహపరలోకంబులందుఁ జేటు వాటిల్లు ననుటకు సంశయము లేదు. నీ వా పాండవులతోఁ గూడి పూజ్యమగు సామ్రాజ్య

మేలుకొనుచున్నఁ జూచెడి వారికెల్ల నెంతయుఁ గన్నుల పండువగు. రాజరాజా! నిచమార్గంబునం బడి ప్రాచీనంబగు భరతవంశమునకుఁ గళంకము రానీయకుము.

భీష్మ—కుమారా! ధర్మముందప్పిన వారికిఁ జేటు వాటిల్లు నను మాట యథార్థము. మా ప్రాణంబు లుండఁగనే బంధు రాజ్య యశో నాశంబు లేల చేసెదవు? దురాలోచనలం బడి చెడిపోవకుము.

చ అనునయ మొప్ప నీ జనకుఁ । డాడిన మాటకు సమ్మతించి యి
ప్పనిఁ గొని యెంతయేని మన । వంశముఁ బావనముం బొనర్ప వ
చ్చిన కమలాక్షు వాక్యములు । చిత్తమునం దలపోసి యిమ్మహా
మును లిడు నాజ్ఞఁ గైకొని మ । ముంగని పొందునకుత్సహింపుమా.

వత్సా! యీ కృష్ణుని సారథ్యంబును నాకృష్ణుని గాండీవంబును నేకీభవింపక మున్న నీవీ కౌరవ వంశముం గాపాడు కొనుము.

దుర్యో—తాతా! యీమాత్రమునకు నేను భయపడుదునే?

ఉ. చెప్పకు మింక నాకుఁ జెవిఁ । జేరవు మీ వచనంబులెల్ల నే
నిప్పృథివీ తలంబు లవ । మేనియు జ్ఞాతుల కీయ నోప మీ,
రిప్పనిఁ బూని యీఁ దలఁతు । రేనియు దానికి సంతసించి నే
నొప్పెడివాఁడఁ గా నికను । నూరక మీకుఁ బ్రియాసమేటికిన్.

విదు—ఈ మాత్సర్యము కురు కుల నాశమునకుఁ దటస్థమైనది. ఇంక నెవ్వరు చెప్పినను నింతకన్న నెక్కువ కాఁబోవదు.

మ. తగవుం దీర్పఁ దలంచి మీకు నిజ బాం । ధవ్యంబు వర్ధిల్ల నిం
తగ నాశించి శ్రమం బటం చనక సం । ధానంబుఁ గావింప నీ
భగవంతుం డరుదెంచె నంచయిన నీ । భావంబునం దెంచ వీ
పొగరుం బోతు తనంబు కట్టి కుడు । పుంబో నిన్ను దుర్యోధనా.

దుర్యో—(జనాంతికము) మామా! యేమి యీ ప్రల్లదములు.

శకు—(జనాం) త్వరపడకుము పిల్లి శాపముల 'ట్లు తెగునా?

కర్ణ—(జనాం) అన్నియు వినుచుండుము పరిణామముచూతము.

దుశ్శా—(జనాం) నా కది యిష్టము లేదు.

శకు—(జనాం) సమయముగాదిది కొంచము సహింపవలయు.

ధృత—(జనాం) కృష్ణా! నానందనుఁడు మందబుద్ధి. తననాశం బుఁ దానెఱుంగకున్నాఁడు. దయయుంచి నీవించుక బుద్ధి చెప్పవలయు.

కృష్ణ—(జనాం) నీకన్న నేనెక్కువ బోధింపఁ గలవాఁడనా? పెద్దవాఁడవు చెప్పుమంటివి గాన నించుక చెప్పి చూచెద. (ప్రి) రాజా! సుయోధనా!

ఉ. పాండు మహీధవుండు పరి ꠰ పాలనఁ జేసిన నేల నేల నా
పాండవు లొప్పరే తగవుఁ ꠰ బల్కెడి వారిది చెప్పరే మహీ
మండల మేల గొల్పెదరు ꠰ మా వచనంబుల నాలకించి పో
నుండిన రాజ్యమందు సగ ꠰ ముండినఁ జాలు నటంచు నెంచుమా.

దుర్యో—నీవు నాకు బిచ్చ మిచ్చు వాఁడ వైన నిచ్చుటి కేల రావలయు?

ఉ. మాటలు వేయు నేల తుద ꠰ మాట వచించెద నేమి నాకు మో
మోటము వాఁడి సూది మొన ꠰ మోపిన మాత్రయు రాదు వారికి
చ్చోటున నెవ్వ రిందు రణ ꠰ శూరులు వారిది రాజ్య మంచు ము
మ్మాటికి నిశ్చయించి రను ꠰ మా చనుమా యనుమాన మేటికిన్.

కృష్ణ—పైత్యోద్రేకంబు గల నాలుకకుఁ గండ చక్కెర విషం బగు నట్లు దుర్లోభంబునం దోఁగు నీ మనంబునకు నా పల్కులు రుచింపవని యెఱింగియు బాంధవ కుల క్షయం బోర్వరాని దగుటం జేసి యింతగాఁ జెప్ప వలసి వచ్చినది.

ఉ. మెత్తు రఁటయ్య! లోకు లిది ꠰ మీఱ రుదారు లధర్మవృత్తికిం
జొత్తు రఁటయ్య! బంధువులు ꠰ సోదరు లాత్మజు లిష్టు లెల్లరుం

జత్తు రఁటయ్యా! వ్యర్థముగ సాధు కులంబునకుం గళంకముం దెత్తు రఁటయ్యా! మీ తెలివితేటల కబ్బుర మయ్యె నయ్యోధా.

దుర్యో—పదు మూఁడు సంవత్సరముల క్రింద గతించిన రాజ్యము మరల వచ్చు నని పెనుగులాడెడి మీ తెలివి తేటలకుఁగూడ మాం కంతకన్న నబ్బుర మగుచున్నది.

[కర్ణ శకుని దుశ్శాసనులు నవ్వుదురు.]

సాత్య—(తలయూఁచుచున్నాఁడు.)

కృష్ణ—నన్ను నీ వేమన్నను నాకు రోసంబు లేదు. కాని నీవు పాండవులం బఱచిన పాట్లకుఁ నీ కురుకుల నాశ దోషంబునకుం గూడఁ బాత్రమవయ్యెద వని విచారించుచున్నాఁడ.

దుర్యో—కృష్ణా! ధర్మరాజు శకునితో జూద మాడి రాజ్య మెల్ల నోడిపోవ నడుమ నే దోసం బెఱుంగని నాపై దోసమారోపించి నన్ను దూఱ నీకు సిగ్గేల్ల లేక పోయెనా? యని పరితపించుచున్నాఁడ.

కృష్ణ—నీవు పరితపింప వలసిన యవసరము లేదు. నడుమంత్రపుఁ గలిమి యెంతటి వారికినిఁ గన్నుఁగాన రానీయదు. నీవా కౌంతేయుల యెడ నొనరించిన యపచారంబు లెంతలో స్మృతికిఁ దప్పెనా? యని మేము పరితపింప వలసి యున్నది.

ఉ. ఉంచితి లక్క యింట నటు లుండిన దానికిఁ జిచ్చుఁ బెట్ట గా
ల్పించితి పాము లెల్లఁ గఱ పించితి వన్నమునన్ విషంబుఁ బె
ట్టించితి వన్నిఁటం బ్రతుకు టించితి త్రాళ్ళను గట్టి నీటఁ ద్రో
యించితి వింకఁ బాండవుల కీ వొనరింపని ద్రోహ మున్నదే.

అప్పటికిని ధర్మ వ్యవసాయంబున బ్రతికియుండు వారలం జూచి యోర్వలేక కపట ద్యూతంబుఁ గల్పించి కడ కిట్టి చేటుపాటునకుఁ దెచ్చిన నాఁడపు నీవు కాదా?

దుర్యో—కపట ద్యూతమో? నిపుణ ద్యూతమో? నీ వేమెఱుంగుదువు? గోపికా పాద సేవా విలాసానుభవ రసికుండ వగు నీకీ రాజకీయ వ్యవహారములతో నేమి పని? యుక్తాయుక్తంబు లారయని నీ సూక్తులు గోపీ కుచ కుంభ పరిరంభణోత్సవమున వినియోగింపం బడుం గాక.

కృష్ణ—(చిఱునగవుతో) రాజరాజా! మా సూక్తులు గోపీ కుచ కుంభ పరిరంభణోత్సవమునకే కాదు. భవాదృశ దుర్మద నిర్మూలనోత్సవమునకుం గూడ వినియోగింపం బడం గలవు.

దుర్యో—(అట్టహాసముతో) భామినీ గణ్యుండవగు నీకీ చాతుర్యము కాలయవన కృత బహుమానంబున సంప్రాప్తించినది కాంబోలు.

కృష్ణ—(చిఱునగవుతో) ఏమైన నేమి? నా చాతుర్యంబు చిత్రరథ విజయోన్నత గ్రీవుండ వగు నీకు గోగ్రహణ కాలంబున నొసంగంబడిన మహోపాయనము వంటిది మాత్రము కాదు.

దుర్యో—మాట మెచ్చుచున్నవి నీ కివి మర్యాద కాదు.

కృష్ణ—నీ కిది మర్యాదయేనా?

ఉ. కొంచెము సిగ్గటుంచయినం గొంకక జంకక శంక మాలి దు
ర్వంచనలోనం దూటి గరువమ్మున నీవలె నాండుదాని నే
చంచలుండైనం గొల్వునకు సాహస మేర్పడం గొప్పువట్టి యీ
డ్పించునె కట్టు పుట్ట మొలిపించునె చీ; తలయెత్తి కాంచునే

అట్టి సభలో నీవును గర్ణుండును నొడలెఱుంగక యేకవస్త్ర యగు నా పుణ్యకాంత నాడిన ప్రల్లదంబులకుం దగిన ఫల మనుభవింపకుందురే.

దుర్యో—చేతం గాని మాటలతో లాభము లేదు.

ఉ. ఆండుది యేకవస్త్ర యగునంగన దాని సభాస్థలంబునం
దీడిచి తెచ్చి రంచు నిపుడేడ్చిన నేమి ఫలంబు వాని నా

నాఁడు దురాశలోనఁ బడి నాతినిఁ బందెము బెట్టి జూదమం
దోడు మటంచెవం డనియె నూరక పేరెలదవేమి యాదవా!

భీష్మ—(చెవులు మూసికొనుచున్నాఁడు)

ద్రోణ—(కనులు మూసికొనుచున్నాఁడు)

ధృత—(భయముచే లేవఁబోవుచున్నాఁడు)

[సభ ఔచ్చనకుచున్నది.]

సాత్య— (ఖడ్గమెత్తి) ఓరీ దుర్మతీ! నీవు మాయన్న గారి దూలనాడు నంతటి వాఁడవఁటరా? యిఁక నీ వుండవు నీ మస్తకము బ్రిద్దలు గావించుట కిదిగో ఖడ్గ ప్రహారము. (లేచుచున్నాఁడు.

దుర్యో—(ఖడ్గమెత్తి) యాదవాధమా! రాసిన్ను నీ కత్తి కెదురు కత్తి యిదిగో. (లేచుచున్నాఁడు.)

[కర్ణశకుని దుశ్శాసనులు లేచుచున్నారు.]

కృష్ణ—(చిఱునవ్వుతో) (సాత్యకి చేయిపట్టుకొని) సాత్యకీ చాలు చాలు నీ పిచ్చి యావేశము లిప్పుడేనా? మనము వచ్చి కార్య మేమి? యీ కోలాహల మేమి?

శకు—దుర్యోధనా! శాంతింపుము శాంతింపుము.

[అందఱు కూర్చుండురు.]

కృష్ణ—దుర్యోధనా! నీకుఁ జెప్ప వలసిన వివరనాక మొక్కటి యున్నది.

ఉ. కాలయమునిఁ నా రణము ఖంబునఁ బార్థుఁడు నిల్చి పాపక
జ్వాలలు గ్రమ్మ మండిపడు పాశుపతమ్ము ధరించి చూడిమొ
దాలుచు దేవదత్త నిన దంబున గుండెలు వ్రక్కలింప న
వ్వేళ నెవండు గాని మొఱ వెట్టిన లాభము లేదు నమ్ముమా.

నీ యనగంబు నెఱుగకున్నాఁడవు.

శా. మాతంగంబుల నుగ్గు సేసి సమర ౯ క్ష్మామండలంబంతు జీ
మూత ధ్వానముతోడ( ద్రిప్పుచు గదన్ ౯ భూరి ప్రభు స్యందన
వ్రాతంబుం బొడి సేసి సైంధవముల౯ ౯ వ్రాలించి భీముండు నీ
సూతుం జంపిన నాఁడు సంధి యనుచున్ ౯ శోకింతు వో దుర్మతీ.

దుర్యో—అంత కాలమున రాఁదగుసంధి కిప్పుడేలత్వరపడెదవు.

కృష్ణ—నిజము నిజము.

కం. నకులుఁడు సహదేవుఁడు సా
త్యకియు సుభద్రాత్మజుండు ౯ ద్రౌపది పుత్రి
ప్రకరంబుఁ గురుబలంబుల(
బెకలింపక మున్న సంధి ౯ పేరెత్తుదువే ?

దుర్యో—నందనందనా! యెందుకీ కంఠక్షోభము ?

కం. భీషణములైన కుత్సిత
భాషణముల కదరి బెదరి ౯ పడుదు ననుకో యీ
వేషములు సాగ విట ని
ర్ఘోషమ్ములలోన( జెప్పి ౯ కొమ్మా పొమ్మా.

కృష్ణ—మంచిది.

ఉ. కాలము పక్వ మయ్యె నిఁకఁ ౯ గార్యము లేదు పసిండిపూఁతల౯
గ్రాలుచుఁబూలుపూయుచును ౯ గాయలుగాయుచుఁబండ్లునందుచున్
వ్రాలక నిల్చి యుండు కురు ౯ వంశ మహా ధరణీరుహంబు ని
ర్మూలము సేయ నెంచితివి ౯ పూజ్యుఁడ వైతివిరా సుయోధనా !

దుశ్శా—(దిగ్గునలేచి) అన్నయ్యా!

మ. కుటిలాలోచన కెల్ల నెల్ల యగు నీ ౯ గోవిందుఁ బంపించి రిం
తటనుం బోయిన భాగ మెట్టులయినన్ ౯ సాధింప వేధింపుమం
చటు లోప్పం బని లేదు దోర్బలము లే ౯ దా వారు నీదేల యి
చ్చట నుండం దగునే ఋఁక౯ మనకు రా ౯ చాలించి వాగ్వాదమున్.

[దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు లేచిపోవుదురు]

భీష్మ—అవురా? యేమీాతండింతటి దురావేశమునఁ గన్నుఁగానక యిందుండు పెద్దల నెల్లం దిరస్కరించి లేచిపోయె. వీని వెనుక నీ కుమతులందఱు నేమితలంచిరో? చనుదెంచిరి. కృష్ణా! యింతకును నీచెప్పినట్లీదుర్మతులకుఁగాలముసంప్రాప్తమైనది.మనమేమిచేయఁగలము.

కృష్ణ—వీఁడెంత యవివేకి యెంతటి వాఁడేని? యింతటి సభలో నింత చులుకఁదనమున లేచి పోవునే? సత్కుల ప్రసూతుండగు వాని కీ యవినయము కీడునకుఁ గాక మేలొనఁగూర్పఁ గలుగునే?

ఉ. కయ్యముఁబూని లోకమునఁ గంటకభావముఁ దాల్చి మున్ను మా
యయ్యకు నమ్మకున్ వగవ నయ్యెడు బాధలు వెట్టుచుండ నే
నయ్యెడ మేనమామ యని యైనఁ దలంపక కంసు దేహముల్
వ్రయ్యలు సేయనే కులము వర్తిల మీా రటు సేయరాదొకో.

ధృత—(వడఁకుచు)తమ్ముఁడా! గాంధారిం దోడ్కొని రమ్ము.

విదు—చిత్తము (నిష్క్రమించి గాంధారితోఁబ్రవేశము.)

గాంధా—నాథా! ప్రణామము నన్ను మీా రీ సభా మధ్యమునకుం బిలిపించిన హేతు వేమి?

ధృత—దేవి! దుర్యోధనుఁడు పాండవులతో సంధి సేసికొనుమని బోధించెడు నీ సభాసదుల వాక్యములఁ దిరస్కరించి దుర్వినయమున దిగ్గున లేచిపోయె. నీవైన నాతనికి బుద్ధిఁ జెప్పి పంపుము.

గాంధా—దేవా! గౌరవనీయులగు నీ మహాత్ము లందఱు చెప్పిన వినని యా దుర్మతి యాఁడుదాన నగు నా మాటకు సమ్మతించునా? దుర్వినీతుఁడగు వానికిఁ జెప్పుటకన్నఁ బ్రాజ్ఞుండవగు నీ వా పాండవుల కేమిచ్చినను నీ కిచట నడ్డుపడు వారెవ్వరు? నాకు సెలవిమ్ము. (నిష్క్రమించుచున్నది.)

కృష్ణ—మా యత్త గాంధారి మహాపతివ్రతా శిరోమణి యెంత సభ్యముగా మాట లాడినది ?

సాత్య—ఆమెకుఁ దెలియని ధర్మములు లేవు.

ధృత—విదురా ! నీ వాదుర్మతిం దోడ్కొని రమ్ము. వాఁడా దుర్మిత్రులతో నేమి పాటు పడ నున్నాఁడో ?

విదు—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత—(స్వ) ఈ సంకటమున నా కేమియుం దోఁపకున్నది. విజయ పక్షము పాండవుల దనుటకు సంశయము లేదు. కాని మహా మోహావేశము మాత్రము నా హృదయము నెడఁబాయకున్నది. నే నిం దేమి ? చేయుదు.

[విదురదుర్యోధనాదులు ప్రవేశింతురు.]

దుర్యో—(స్వ) మంచి సమయము తటస్థ మైనది.

ఉ. కర్ణుఁడు మేనమామయు న ॥ ఖండుఁడు తమ్ముఁడు నుండ నింక నా
నిర్ణయ మెట్లు పోఁ గలుగు ॥ నేఁ డిటఁ గృష్ణునిఁ గట్టి వైచినన్
బూర్ణ మగున్ మనోరథము ॥ భూరి మహీ విభవంబు దక్క ను
త్తీర్ణుఁడ నయ్యెదన్ బిదపఁ ॥ దీరెడు కార్యము తాన తీరెడిన్.

పాండవు లీముకుందు నాధారము చేసికొని పాటు పడు చున్నారు. ఈతండు లేని నాఁడు వారి పరాక్రమము లన్నియుం దెల్లను గాఁగలవు. దాని కిదియే సూత్రము. (ప్ర) జనకా ! నన్నేటికిఁ బిలిపించితివి ?

ధృత—నాయనా !

చ. దొరకినఁ నీకుఁ జెడ్డ నయి ॥ దోడులు వారలతోడఁ గూడి దు
ష్కరములు సేయ నెంచితివి ॥ కార్యము లేదు మహాత్ముఁడైన శ్రీ
హరి వచియించు వాక్యమున ॥ కష్టముఁ జెప్పితి వేని నేను దు
ర్భర మగు పుత్రశోకమునఁ ॥ బ్రాణములం ద్యజియింతు నాత్మజా.

దుర్యో—అన్నిఁటికిని ముందు శకునపక్షివలె బయలుదే
చుందువు నీకెన్నిమారులు చెప్పినను మాతంత్రము బోధపడకున్న

దుశ్శా—(జనాం) అన్నా! యేమి?

కర్ణ—(జనాం) దుశ్శాసనా! చూచెద వేమి?

శకు—(జనాం) (కను సైగఁ జేయుచున్నాఁడు.)

దుర్యో—(జనాం) తమ్ముఁడా! యెక్కడ?

దుశ్శా—(జనాం) ఇవిగో త్రాళ్ళు.

(నలువురు లేచి గమకింతురు.)

కృష్ణ—దురాత్ములారా! నామహిమ మీకుఁదెలియకున్న

"జయ జయ" [విశ్వరూపప్రదర్శనము.]

[పుష్పవృష్టి భేరీనాదను కలకలము.]

(దుష్టచతుష్టయము పరుగిడుచున్నది.) (యవనిక పడుచున్న

[గంధర్వ మిథునము ప్రవేశించుచున్నది.]

నాథ—కాంతామణీ! చూచితివా?

సీ. శివు లొక్కకడ రమా ♦ ధవు లొక్కకడఁ బద్మ
భవు లొక్కకడ గాజు ♦ వాఱుచుండ
సుర లొక్కప్రక్క న ♦ చ్చర లొక్కప్రక్క భూ
సురు లొక్కప్రక్క లో ♦ జొచ్చుచుండ
రవు లొక్కదెసఁ గృశా ♦ నువు లొక్కదెస నిశా
ధవు లొక్కదెస సొక్కి ♦ తరలుచుండ
యము లొక్కవంక శై ♦ లము లొక్కవంక సం
ద్రము లొక్కవంకఁ దా ♦ రాడుచుండ

గీ. ఆది మధ్యాంత శూన్య మ ♦ నక్షరంబు
నగుచు బ్రహ్మాండ మాత్మలో ♦ నడఁచికొనుచు.

బలు తెఱంగుల విశ్వరూపంబు వెలిఁగె
వెలుఁగులకు నెల్ల మొదలింటి వెలుఁగనంగ.

కాంత—నాథా! నాకాతేజోవిశేషమువలనఁగనులుమూఁతపడినవి

శా. ఎన్నో వక్త్రము లెన్నియో రసన లెన్నెన్నో లలాటంబు లె
న్నెన్నో కర్ణము లెన్నియో శిరము లెన్నెన్నో పిచండబు లె
న్నెన్నో ఘ్రాణము లెన్నియో భుజము లెన్నెన్నొ గదే కన్ను ల
న్నన్నా నాకది చూడఁగాఁ బ్రళయ మన్నట్లుండె వేయేటికిన్.

నాథ—మనబోంట్లకుఁ బ్రళయముకన్నమిన్నగానుండుననుటకు సంశయములేదు. కాని మహాత్ముల కది చంద్రికాప్రసారము.

కాంత—ఎవ్వరైన నేమి? ఆరూపము దుర్నిరీక్ష్యము.

నాథ—కాంతా! నీ వట్లనకుము. భీష్మద్రోణాదులా సమీపమున కేగి స్తోత్రములు గావింప లేదా?

ధృత—(నేపథ్యములో.) (భుజంగప్రయాతం.)

తమో లోకబంధో! మహానందసింధో!
రమామానసేందో! క్షమా మూలబిందో!
సమస్తాదిహేతో! భవాంభోధి సేతో!
నమస్తే నమస్తే నమస్తే నమస్తే.
వసంతి ప్రభో తావకే గర్భకోశే
లసంతి ప్రకామం జగంతి క్రమేణ
అసామాన్య మాస్తే మహత్త్వం త్వదీయం
ప్రసీద ప్రసీద ప్రసీద ప్రసీద.

కాంత—(ఆలించి) నాథా! ఆస్తోత్రము లెవ్వరివి?

నాథ— కాంతా! భగవదనుగ్రహముచేఁ బ్రాప్తించిన దివ్యచక్షువువలన ధృతరాష్ట్రుండు విశ్వరూపముంజూచి స్తోత్రముఁ గావించుచున్నాఁడు.

ధృత—(నేపథ్యములో.)

శా. ధన్యం బయ్యె మదీయ జన్మము కృతార్థం బయ్యె మద్వంశమే
నన్యం బొల్లఁ ద్వదీయ దర్శనము సంప్రాప్తించె దుష్టాభిమా
న న్యాయాత్ముల నీ దురాత్ములఁ గనన్ న్యాయంబు గాదింక నీ
హైన్యం బేటికి నాకు నేత్రములఁ గృష్ణా సంహరింపం గదే.

కాంత—(ఆలించి) మరల నేమి? యది.

నాధ—లలనా! ధృతరాష్ట్రుఁడు దివ్యచక్షువుచే నజ్ఞానభూయిష్ఠులగు నరులఁ జూడనొల్ల నని తనకుయథారూపముంగోరుచున్నాఁడు.

కృష్ణ—(నేపథ్యములో) తథాస్తు తథాస్తు.

కాంత—భగవంతుఁడాతని కంధత్వముఁ బ్రసాదించి నట్లున్నది.

నాధ—దానితో మోహాంధత్వముగూడఁ బ్రసాదింపఁబడినది.

కాంత—అది మీ కెట్లు తెలిసినది?

నాధ—నే నీ రహస్యముఁ జెప్పెద రమ్ము.

(నిష్క్రమింతురు.)

గద్య. శ్రీమత్పరమ పవిత్ర భారద్వాజస గోత్రాపస్తంబసూత్ర
యజుశ్శాఖాపాత్ర సీతారామ పుత్ర కనకాంబా గర్భ
శుక్తి ముక్తాఫల పరమేశ్వర ప్రసాద సముపలబ్ధ
ఘటికాశత గ్రంథకవనసామ్రాజ్య చిదంబర
కవీంద్ర ప్రణీత శ్రీకృష్ణసందేశము.

చతుర్థాంకము.



# కృష్ణసందేశము.

## పంచమాంకము.

### విష్కంభము

[శకుని దుర్యోధన దుశ్శాసనులు ప్రవేశింతురు.]

దుర్యో—మామా! యేమది? యా కృష్ణుని రూప మంత భయంకరముగా నున్నది?

శకు—అది యంతయు నింద్రజాలము గాని వేరేమియుఁ గాదు. దానివలన లేశమేనియుఁ బ్రయోజనము లేదు. నిరర్థకము. డాంబికము. ఇదఁ మాత్ర మాంతర్యమున నుంచికొని రథము నడిపికొనుచుండుము.

దుర్యో—మామా! నీవు చెప్పిన మాట యథార్థము. కానిచో నాతని కీభువనంబు లన్నియు గడగడ వడంకక పోయినవా?

దుశ్శా—మా మామ శకునికన్న మఱియొకఁడింత మంత్రదక్షుఁ డుండఁ డని నా నమ్మకము. లేనిచో నా వెఱ్ఱి మొఱ్ఱి గొల్లవాని కింత ప్రభావ మెక్కడిది?

దుర్యో—మామా! తమ్ముని మాట కడు విశ్వసనీయము.

శకు—దుశ్శాసనుఁ డన సామాన్యుఁడు గాఁడు. ఈతని బుద్ధి జలనిక్షిప్త మగు తైలబిందువు చందంబున సర్వవ్యాపకమగుచుండు.

దుర్యో—మామా! మన కర్ణుఁ డీసమయమున నెచ్చటి కేగియున్నాఁడో? గమనింపుము.

శకు—మనము నామము పెట్టిన తరువాతఁ గృష్ణుఁడు వాని కేమో? రహస్యముగాబోధించుటకుఁదన వెంటఁదీసికొనిపోయినట్లున్నది.

దుశ్శా—ఆతఁడాతని మాయావచనములకు లోఁబడఁడుగదా?

దుర్యో—కంఠము పోవుఁగాక కర్ణుఁడు మన యాలోచన నతిక్రమించి పోయెడి వాఁడు గాఁడు.

శకు—సత్యము వాక్రుచ్చితివి కాని మనము ముగ్గుర ముండిన కాలమున నాతండు లేకుండుట నాకొకకన్నులేసియట్లున్నది.

దుర్యో—మామా! జన్మకాల విశేష మేమియో? కాని మన నలుగురకుం గుదిరిన యైకమత్య మన్యులకు ఘటింప నోపదు.

శకు—అదియంతయు గ్రహకూటబలముగాని మనబలముగాదు.

దుర్యో—మంచిది. మామా! వారేమి యాలోచింతురో? కని పెట్టవలయు మన మేగుదము.

(నిష్క్రమింతురు.)



—— ఏకాంతస్థలము. ——

[కృష్ణ కర్ణులు ప్రవేశింతురు.]

కృష్ణ—కర్ణా! సమధికబలాకీర్ణా! నీకొక రహస్యం బెఱింగింప వలసి యున్నది యాకర్ణింపుము. వృద్ధ జన సేవా ప్రవర్ధమానుండవగు నీవు ధర్మంబు లెఱుంగని వాఁడవు కావు. మున్ను కుంతీమహాదేవి మార్తాండునారాధించి నిన్నుఁగనుంగొనియె. నీవుపాండుమహారాజునకు జ్యేష్ఠపుత్రుండవు నీ జన్మ రహస్య ప్రకార మించుక నేనెఱింగించితినేని పాండవులు నీ యడుగులకు మడుఁగు లొత్తెదరు.

సీ. ధర్మపుత్రుఁడు నీకుఁ ॥ దగు యువరాజయి
ప్రమదంబుమైఁ జామ ॥ రములు వీవ
వాయుపుత్రుండు నీ ॥ కేయెడఁ శుభము చే
కూరఁగాఁ దెల్లని ॥ గొడుగు వెట్ట
విజయుండు నీకు ది ॥ గ్విజయంబు గల్గు చం
దంబున సూత కృ ॥ త్యంబు సేయ
కవలు మాత్స్యాది భూ ॥ ధవులతోఁ గూడి మిం
చిన భక్తి నీ పాద ॥ సేవ సలుప

గీ. నిండు పేరోలగంబుండి ॥ పాండుతనయ
చయులు వుట్టించు సిందరి వై ॥ భవము మీఱఁ
బరమ సౌభాగ్యవతిని ద్రౌ ॥ పదిని గూడి
యీ మహీచక్ర మెల్ల నీ ॥ వేలుకొనుము.

బావా! నీకు మేమందఱము సర్వసర్వంసహాచక్రంబు నేకచక్రంబుగాఁ బరిపాలింపఁ బట్టంబు గట్టెదము. నీవు మఱి యొక విధముగా నాలోచింప వలదు. కౌంతేయా! యిది నీ తల్లి యగు కుంతీమహాదేవికిని సమస్త బంధు నికరంబునకును బ్రియంబగు కృత్యంబు

నీ వీమహేంద్రవిభవంబున కొఁడంబడి కౌరవ పాండవ కులంబులఁ గాపాడ వలసి యున్నది.

కర్ణ — మాధవా! మున్ను నేను నా జన్మప్రకార మొక్కింత యాదిత్యుని వలన విని యుంటి. మరల నిప్పుడు నీవలన నెఱింగితి. కుంతీదేవి నన్నొక నదీప్రవాహమునం బడవేసి పోవ నొక సూతుండు దైవవశంబున నచ్చటికి వచ్చి కొట్టుకొని పోయెడు నన్నుఁ బట్టికొని తన సతీమణి కడకుఁ గొనిపోయినంతఁ బుత్రప్రేమంబునఁ జేఁపిన యామె స్తన్యంబు నాకుఁ బ్రాణాధారంబయ్యె. అది మొదలు నన్నుఁ బెంచి పెద్దఁ గావించిన నా తలిదండ్రుల విడనాడి నే నిప్పు డప్పాండవులం గలయుట నీకు సమంజస మని తోఁచెనా? దామోదరా! దురాశకు లోఁబడి నే నధర్మ మార్గముం దొక్కెడి వాఁడను గాను. నీ వనినట్లు వృద్ధ జన సేవా ప్రవర్ధమానుండ నగు నా కిట్లెన్నఁడును బోధింపకుము.

కృష్ణ — ధర్మజ్ఞ శిరోమణీ! నీ వంత సధర్ముండ వైన వారితోఁ గూడ నీవేల? ధర్మ పక్షంబునం బ్రవేశింపరాదు.

కర్ణ — కృష్ణా! మంచి మాట నొడివితివి కాని.

ఉ. తమ్ములకన్న మిన్నయగు ♦ తత్పరభావముతోడ నన్ను రా
రమ్మని కౌఁగిలించికొని ♦ ప్రాజ్ఞుఁడ వైతి వటంచు జాతిహీ
నత్వము గణింపకుండఁ దన ♦ యంతటి వానిఁగఁ జేసి స్నేహభా
వమ్మునఁ జూచు మా కురున్ృ ♦ పాల శిఖామణి నెట్లు పాయుదుఁగా.

కృష్ణ — కర్ణా! నీ విందు విచారింపవలదు ధర్మజ్ఞుండవగు నీకుఁ బక్షపాతం బెన్నఁడుం బనికిరాదు. పక్షపాతంబు సర్వానర్థంబులకుఁ గారణంబు. హితుండగు వాఁడనర్థ దాయకుండు గారాదను సందర్భము నీ వెఱుంగనిది గాదు. నీవిప్పుడునామాటవినకుంటివేని? సమూలంబునఁ గురుకుల క్షయోత్పాతం బుద్భవిల్లు ననుటకు సందియము లేదు.

ఉ. బోధ మెఱుంగ లేఁడు పరి । పూర్ణ మదంబున నున్నవాఁడు దు
ర్యోధనుఁ డా కులాంతకుని । యూహకు లోఁబడి నీవు ధర్మ సం
బాధ మొనర్పఁ బూనుకొను । వాఁడవు కావని నిశ్చయించి ని
ర్బాధకమైన సాధనముఁ । బల్కితి నీ మది కెట్లు దోఁచునో.

కర్ణ—వాసుదేవా! నీ పలికినది యథార్థంబైనను క్షత్రియ ధర్మంబునకు విరుద్ధంబుగా నున్నది.

శా. నన్నా పార్థున కీడు జోడనుచు స్వాం । తంబందునన్ నమ్మి నా
కన్నన్ వేరొకరుండు లేఁడతనితోఁ । గయ్యంబునన్ నిల్చి య
త్యౌన్నత్యంబును జూపు వాఁడనెడు ధై । ర్యంబూఁతగాఁ గొన్న మా
యన్నన్ గౌరవ మేదినీంద్రు నెడఁబా । యన్ నాకు న్యాయంబొకో.

కృష్ణ—క్షత్రియధర్మం బెఱింగిన ప్రాజ్ఞుండవైన నీ విట్లాడుదువే?

ఉ. దాయము నీయకుండ వసు । ధా తల మెల్ల భుజింతు నంచు న
న్యాయము సేయఁ బూనిన దు । రాత్ము సుయోధను నెన్నఁడేనియున్
బాయ నటంచు నొక్కమొగిఁ । బల్కెదు నీ కిది ధర్మమే నిజ
శ్రేయముఁ గాంచ లేని విప । రీత వివేకము గాక ప్రాజ్ఞుఁడా!

కర్ణ—మాధవా! నీ వెన్ని ధర్మంబులు చెప్పినను నివి యన్నియుఁ గృతఘ్న మార్గంబున కాదర్శము లగుచున్నవి. కృతజ్ఞుండ నగు నేను నీ సాధనంబున నిప్పుడు కృతఘ్నుండఁ గాఁజాల క్షమింపుము.

కృష్ణ—కర్ణా! నీ వింత మాత్రమునకే కృతజ్ఞకోటిలోఁ జేరితి నని సంతసించుచుంటివి కాని నీ కది యెన్నఁటికిని సిద్ధింప నేరదు. దురితంబులం జేసి దురాత్ముండు సంపాదించిపెట్టిన కూటికి లోఁబడి వర్తించెడి భూస్తు లెల్లరు కృతజ్ఞు లైన నింక లోకమునఁ గృతఘ్నుఁడు కాని వాఁ డెవ్వఁడు?

కర్ణ—కృష్ణా! చవిలేని యీ పలుకులతో లాభ మేమి?

ఉ. నే నిపు డేగుదెంచి తగు నీతి యటంచుఁ దలంచి విభ్రమ
జ్ఞానములోన మున్గి విర సంబగు రీతిఁ గిరీటితోడ సం
ధాన మొనర్చికొన్నయెడ ధైర్యము లేని బికారి యంచు నె
న్నేనియుఁ దిట్టి నన్ను నిహీ హీ యని నవ్వరు నవ్వకుందు రే.

నేనును నష్టమానుఁడను రణరంగమున డాకొనకున్న మహోపార్జితంబగు నస్త్రవిద్యావైశిష్ట్యంబునకు ఫలంబు లేదని నా యాంతర్యము. ఇంతకన్న నీకుఁ జెప్పవలసినది లేదు.

కృష్ణ—జాడ్యావిష్టునకుఁ బథ్యంబు రుచింపని యట్లు నే నాడిన మాటలు నీకుఁ బాడి గాకున్నయవి. నీ కీడు నీ వెఱుంగక మోడి వేయుచున్న వాఁడవు.

ఉ. కర్జము లేదు నీయెడలఁ గౌరవ పాండవ సంగరంబునన్
నిర్జరవీరు లెల్లఁ గన నీకుఁ బరాభవ మొందె సత్వరో
త్సర్జితమైన సాయక శతంబున నాశన మొందె గాక యా
దుర్జయుఁడైన యర్జునుని తోడను నీ వెదిరించి నిల్తువే.

దురభిమానంబున నేల ? చెడిపోయెదవు.

కర్ణ—వార్ష్ణేయా ! యెంత శూర ధర్మం బుపదేశించితివి ?

ఉ. యుద్ధము గల్గుఁగాక తను వూడిన నూడెడుఁగాక ధర్మపుం
బద్ధతి నేను మాత్ర మెడఁ బాయ నొనరించుట కొల్ల నన్నుఁ బట్
బుద్ధులు సెప్పఁ జాలిన పరి బోధము గల్గిన వాఁడ విల్లసం
బద్ధములైన వాక్యములు పల్కుట కీ వెటు లోపినాఁడవో.

శూరధర్మంబు లన వీరాగ్రేసరులకుం దప్ప సామాన్యుల కెఱుంగ శక్యములుగావు మాధవా ! కురుకులేశ్వరు నెడఁ బాసి నా కంఠమున జీవము లుండు నంత వఱకు నే నితరులఁ గలయుదు నని నీవు కలనైనం దలంపవలదు.

కృష్ణ—రాధేయా ! కలయకున్న నిలువఁ గలవా ?

ఉ. చండ పరాక్రమ క్రమ విశారద మూర్తి ధనంజయుండు దో
ర్దండములందు గాండివముఁ దాల్చి రథంబున నుండఁ బర్వతం
బుండిన రీతి నే నొగల నుండ నొకండవు నీవ కాదు బ్ర
హ్మాండము లేకమైన నెదు రాడఁ దరంబగునే మురంబునన్.

అఖండ సామ్రాజ్య రమా ధురంధరుండవై కాఁదగు నీవకాల మరణావశంవదుండ వగుట కేల సమకొనియెదవు?

కర్ణ—కృష్ణా! నే నింతమాత్రము భండనోద్యోగ మెఱుఁగని భిక్షుకుండ ననుకొంటివా యేమి?

ఉ. భండనమందు నిల్చి రిపు వర్గము నెల్ల హరించి వీరభ
ద్రుండనఁ బొల్చి నేను బహు రోషణ భీషణ వేష మూని నా
చండతర ప్రభావ మగు శక్తి ప్రయోగముఁ జేసినన్ జగ
న్మండలమందు నాకెదిరి మార్కొనువాఁడెవఁడో వచింపుమా.

కృష్ణ—సూతనందనా! నీ ప్రాశస్త్యంబు నా యెదుట నేల పొగడుకొనెదవు?

ఉ. డంబములన్ వచించిన దృఢం బగు కీర్తి జనింపఁ బోదు స
త్యంబగు ఫూర్తి రాదు దుర హంకృతి లాభము సేయ లేదు ని
క్కంబుగఁ జూడ గోగ్రహణ కాలము నాఁడె త్వదీయశక్తి స
ర్వంబు కనుంగొనం బడియెఁ బల్వురచే నిఁక నింత యేటికిన్.

కర్ణ—యాదవనందనా! నీ వొనర్చిన మహాకృత్యములకు నన్నాక్షేపింప వలయునా? యెంత తక్కువైనను వీరనందనుండనుగాని నేను యాదవనందనుండనుగాను నీ వనినదానికిఁ బ్రత్యుత్తరము వినుము.

శా. గోటన్ దీరెడు నట్టి కార్యమునకున్ గొడ్డళ్ళ నేలా సము
ద్ఘాటింపన్ వలె నంచు శక్తి నొక ప్రక్కన్ బెట్టియున్నాఁడఁ గా
నీ టాటోటుల మారి పార్థునకు నాఁడే గాదు నేఁడేని జం
ఝాటంబార్పకయూరకొందుననియెంచంబోకుమాయాత్మలోన్.

కృష్ణ—సమయము దప్పిన పిమ్మట సమకూర్చు కొనుట కేమాటయైన నడ్డము వేయవచ్చు. అది మాకు నేర్పవలసిన విద్య గాదు. బావా! నీ వెంత నన్నాక్షేపించినను నాకది యిష్టమే కాని నామాట యొకటి వినుము.

గీ. కౌరవుల కెన్నఁటికి నేని గలుగఁ బోదు
జయము రణరంగమందు సందియము లేదు
లేని పోని యపోహాల లోనఁ జిక్కి
చెడెద వీవని నే నింత నుడువ వలసె.

కర్ణ—నీ మాట యథార్థంబు.

కం. పాండవులకుఁ గౌరవులకు
భండన మగు నందు ధర్మ భవునకు విజయం
బుండు నది నే నెఱుఁగని
బండారము గాదు చెప్ప వలెనే కృష్ణా!

కృష్ణ—నీ వీరహాస్యము లెఱుంగని వాఁడవు కావనియే నీ కింత దూరము బోధింపవలసివచ్చినది.

ఉ. యుక్త మెఱింగి నీవు సమయోచితమున్ గుఱుతించి ధర్మ సం
రక్తి నెసంగి కౌరవ పరాభవమున్ గమనించి చూచి నా
సూక్తి గ్రహించి నిర్భర యశో ధన దీప్తములైన పాండవ
వ్యక్తుల నాదరించి కురు వంశము నీయెడ నుద్ధరింపుమా.

కర్ణా! నీవు పాండవ పక్షంబునం బ్రవేశించినయెడ నిన్నుఁ జూచికొని యుద్ధసన్నద్ధుండగుచుండు దుర్యోధనున కుత్సాహము తగ్గి పొందు సమకూరు. లేనిచో? వంశనాశంబు చేకూరు.

కర్ణ—నా మాట యెట్లుండినను యుద్ధము మాత్రముతప్పదు. దుర్యోధనుండు తా నతిసాహసంబున నున్నవాఁడు వాని తమ్ము లాతనియాన కొడంబడి యున్నవారు. నాకు మాత్ర మీయవమాన

మేల రావలయు? నా జన్మ రహస్యము మాత్రి మెన్నఁటికిని బహి రంగము గావింప వలదు.

ఉ. ఇమ్మహి నేకచక్రముగ నేలి దురాత్ముల రూపు మాపి ధ
ర్మమును బాదుకొల్పఁదగు రాజమహేంద్రుఁడు ధర్మజుండు నా
తమ్ముఁ డటంచెఱుంగు నెడఁ దా నిసుమంతయుఁ గాని యాధిప
త్యమ్ము వహింప నొల్లఁ డది ధాత్రికి లోపము సుమ్ము మాధవా.

కృష్ణ—కర్ణా! నా మాట విని నీ వింత సాహసంబున కొడిగట్టకుము లోకులు నిన్ను దూఱుదురు పైనవిచారించినలాభములేదు.

కర్ణ—కృష్ణా! తమ్ములు ఋత్విజులుగను నీ వుపద్రష్టవుగ నుండ ధర్మతనయుండు కౌరవ పశు వధంబున నాయోధన యజ్ఞము చేయఁగలండు. తత్కృత్యమునఁ బుణ్యభూమి యగు కురుక్షేత్రమునందు మాబోంట్లకెల్ల సద్గతి ప్రాప్తింపఁ గలదు. నీవింక బోధింపనక్కఱలేదు.

కృష్ణ—అయ్యో యెంతపాపమునకొడిగట్టినావురా రాధేయా!

కర్ణ—యాదవనందనా! చిత్రనాటకకర్తవగు నీకు లేని పాపంబులు నాకెక్కడివి?

కృష్ణ—కర్ణా! నీమూలమునఁ గురువంశమునకెల్లఁ జేటు వాటిల్లనున్నది. కనుంగొనుము.

కర్ణ—కృష్ణా! సర్వమునకు నాదిమూలంబవగు నీవు నన్నేటి కిచ్ఛకము లాడెదవు?

కృష్ణ—నే నాడిన పథ్య మెల్ల నీ కపథ్య మైనది.

కర్ణ—పథ్య మపథ్యమెన్నఁటికిం గాదు.

కృష్ణ—కర్ణా! నేనిప్పుడునీకుబోధించినబోధమెల్ల నపథ్యమేనా?

ఉ. కమ్మని తేనె పానకము గర్వముచే దిగఁ ద్రోచినట్లు య
త్నమ్మున నే నొసంగిన హితమ్ము నవజ్ఞ యొనర్చి నీ యభీ

ష్టమ్మునఁ బోవ నుంటి వీఁక । సాధ్యము గానిది చెప్పరాదు । శీ
ఘ్రమ్మునఁ బొమ్ము నీనుదుట । వ్రాసిన వ్రాఁత తొలంగిపోవునే.

నేఁటికెనిమిది దివసంబులకు భండనము ప్రారంభింపఁబడు నని మీ దుర్యోధనాది రాజలోకంబున కెల్లఁ జెప్పుము.

కర్ణ—కృష్ణా! నే నీ సంగ్రామసముద్రంబు నీదఁ గలిగితినేని? మరల నిన్ను దర్శించెద లేదేని? యూర్ధ్వలోకంబునం గాంచెద.

(కౌఁగిలించుకొని నిష్క్రమించుచున్నాఁడు.)

కృష్ణ—ఆహా! యెంత దుర్నయకాలము సంభవించినది? లేకున్న నీ కౌంతేయుఁడు నా వచనంబులం గూడఁ దిరస్కరించిపోవు వాఁడే? ఇంతకును దైవమాయ యెంతటివారికిని దాఁట శక్యము కాదు. నాయెడఁ దప్పు లేకుండ నే నాకౌరవులకును నీకర్ణునకును జెప్పవలసిన మాటలన్నియుం జెప్పితి వృద్ధజనమండితంబగు సభామండపంబునఁ బాండవులవలస నేమియుం దప్పు లేదనిపించుకొంటి. ఇఁక నేను చేయవలసిన దేమున్నది? ముందుఁ గుంతీదేవికడ కేగి యామెకీవార్త నెఱింగించి పోవలయు.

(నిష్క్రమించుచున్నాఁడు.)

గద్య. శ్రీమత్పరమ పవిత్ర భారద్వాజస గోత్రాపస్తంబసూత్ర
యజుశ్శాఖాపాత్ర సీతారామ పుత్ర కనకాంబా గర్భ
శుక్తిముక్తాఫల పరమేశ్వర ప్రసాద సముపలబ్ధ
ఘటికాశత గ్రంథకవనసామ్రాజ్య చిదంబర
కవీంద్ర ప్రణీత శ్రీకృష్ణసందేశము.

పంచమాంకము.



— ♦ గంగాతీరము. ♦ —

[కర్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కర్ణ—(సూర్యాభిముఖముగా నిలిచి)

శ్లో॥ నమ స్తే జగతాం నేత్రే - నమ స్తే ద్వాదశాత్మనే
నమ స్తే జ్యోతిషాం కర్త్రే - నమ స్తే కర్మసాక్షిణే.

(అర్ఘ్యము విడుచుచున్నాఁడు.)

శ్లో॥ సర్వ జ్యోతి స్స్వరూపాయ - సర్వ మంత్ర స్వరూపిణే
సర్వోపాధి ప్రధానాయ - నమ స్తే సర్వ సాక్షిణే.

(అర్ఘ్యము విడుచుచున్నాఁడు.)

శ్లో॥ సర్వోపాధి వినిర్ముక్త - బ్రహ్మలోకాప్తి హేతవే
నమ స్తే పరమానంద - స్వప్రకాశాది సేతవే.

(అర్ఘ్యము విడుచుచున్నాఁడు.)

కుంతి—(నేపథ్యములో) కుమారా! కుమారా!!

కర్ణ—(చెవియొగ్గి) కుమారా! యని కేక వేయుచున్నారెవ్వరు?

కుంతి—(ప్రవేశించి) కుమారా! కుమారా!

కర్ణ—(సంభ్రమము) దేవీ! రాధేయుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

కుంతి—నాయనా! నీవు రాధేయుండవు గావు. మున్ను నేను కన్నియనాఁడు దుర్వాసునకు శుశ్రూషఁగావించుచుండ నమ్మహాత్ముం డనుగ్రహించి నాకొక మంత్రం బుపదేశించె. నేను దాని ప్రభావం బెఱుంగఁదలంచి భాస్కరునారాధింప నా మహనీయుండు విచ్చేసి నాకుఁ గన్యాభావంబు దూష్యంబు గాకుండ నాయందు నిన్నుఁ గనుం గొనియె. నాయనా! నీవు కుంతీ పుత్రుండవు ధర్మ భీమార్జున నకుల సహదేవులు నీ కనుజన్ములు బ్రహ్మాండ మండలోదరుండగు పుండరీకాక్షుండు నీకు బావమఱంది. కుమారా! నేఁటికి నిన్నుఁ గనులారఁజూచు కొను భాగ్యము సంప్రాప్తించినది. నేను ధన్యురాలనైతి.

కర్ణ—దేవీ ! నీ విచ్చటికి వచ్చిన కార్య మేమి ?

కుంతి—పుత్రికా ! ధార్తరాష్ట్రులకును బాండవులకును నధి నాథుండవు కాఁదగు నీవితరులం గొలువ న్యాయంబుగాదు. ఆత్మజా ! నీ వృత్తం బవలోకించుచున్న కొలందియు నాకు నిద్రాహారంబులు రుచింపకున్నవి. తనయా !

గీ. వీరమాత యటంచును ౹ పేరు నాకు
నిలుపఁ దలఁచితివేని పే ౹ రలుక లేక
వినయ యుతుఁడైన ధర్మనం ౹ దనునితోడఁ
గూడి భువి నేలుకొనుమయ్య ౹ కొడుకుకుట్ట.

కర్ణ—దేవీ ! పుత్ర ప్రేమంబు నివ్విట్లిఁ గుమారులకుఁ దల్లు లుపదేశింప వలసిన పలుకు లుపదేశించితివి.

ఉ. వీరుఁడఁగాని యించుకయు ౹ భీరుఁడఁ గాను గదమ్మ క్షత్ర సం
స్కారము లేని నే నిపుడు ౹ సాటిగ నల్వురిలోని కెట్లు పో
నేరుతునమ్మ పాండుధర ౹ ణీపతి సూనుఁడ నంచు నెట్లు రా
నేరితునమ్మ వ్యర్థముగ ౹ నీవు శ్రమంపడ నేటికమ్మరో.

ఆదిత్యప్రసాదంబున నింతవఱకు మదీయజన్మం బతిరహస్య భూతంబై యున్నది. దీనిం బ్రకటింప నీకు సమంజసము గాదు.

కం. వీరాగ్రేసరుఁ డనియెడి
పేరొందిన నేను పోయి ౹ పెరవారి దరిం
జేరి తల వాంతు నని నీ
వారయకుము స్వప్నవేళ ౹ నైనను జననీ.

కుంతి—నాయనా ! నీవు వారి దరి కేగనవసరము లేదు నీకు సమ్మతమైన వారే నిదరి కేతెంతురు కాని నీవీదుర్మతుల దరినుండవలదు.

కర్ణ—తల్లీ ! తినఁ దిండియుఁ గట్టఁ బుట్టంబులు నైతమొసంగి ప్రాణముకన్న మిన్నయని నన్నెన్నుకొనుచుండు సుయోధనుని నే

నీసమయంబున విడనాడితి వేని లోకమున కెంత దూష్యుండనగుదునో ? నీ వెఱుంగనిదిగాదు. జననీ! నాయందధర్మమిదియని నీవు చెప్పఁగలవా?

కుంతి—తండ్రీ! అధర్మపరు నాశ్రయించుట కన్న నీయందు వేఱొం డధర్మ మేమున్నది ?

కర్ణ.—అది యధర్మ మెన్నఁటికిం గాదు.

ఉ. నమ్మిన వారలన్ విడిచి నామము నీమము లేక లోక మా
నమ్మగు స్థానమున్ విడిచి నల్వురిలో మొగ మెత్తుకంటెఁ బూ
జ్యమ్మగు యుద్ధరంగమునఁ జచ్చి నిరంకుశమైన స్వర్గ సౌ
ఖ్యమ్మున నోలలాడఁ దగు నా తగదా వచియింపు మమ్మరో.

కుంతి—తండ్రీ! వంశనాశమేల చేసెదవు? నీవింత పట్టుపట్టకుము.

కర్ణ—ఇంక నాకు విశేషము చెప్పకుము.

ఉ. తీఱదుఁ గాక నాకు జగతీ తల భోగము లోక మెల్లెడన్
దూఱెదుఁ గాక నన్ను నయదూరుఁ డటంచు వినాశనంబు చే
కూఱెడుఁ గాక నిక్కముగఁ గుత్తుక యుండిన మారు మాట రా
నేరదు నాదు నోట జననీ చను నీ కనుమాన మేటికిన్.

కుంతి—నాయనా! నన్నేల దుఃఖసముద్రమునముంచెదవు ?

కర్ణ—చింతింప నేటికమ్మా!

ఉ. దేహ మశాశ్వతం బెపుడు దేహికి సౌఖ్యము లేదు నిక్కమీ
మోహములోనఁ గూలి చెడిపోవుచు నుండు సమస్త జంతుసం
దోహము నిత్య మేదియును దోఁపదు సత్యము కానరాదు సం
దేహము లేల నీకు జననీ కను మీ జగదింద్రజాలమున్.

ఉ. ఒక్కఁడు నిన్నఁబోయె మఱి యొక్కఁడు నేఁడుగతించుచుండె వే
ఱొక్కఁడు రేపు మాపు చన నుండె క్షణంబున కేమి వచ్చునో
యొక్కఁడు గూడ గుర్తెఱుఁగఁ డో జననీ యిఁక శాశ్వతంబుగా
నొక్కెడ నుట్టిఁ గట్టుకొని యూఁగెడి వాఁడెవఁడో వచింపుమా.

పూర్వకర్మానుసారంబున సమస్తజంతువులకు జనన మరణ ప్రవాహములు స్వాభావికములు. పుత్ర మిత్ర కళత్రాది భావంబు లజ్ఞానవిలసితంబులు. ఉపాధి సందోహంబులందు నిర్గుణంబును నిర్వికారంబును నిత్యంబు నగు నాత్మ యొక్కఁడు ప్రకాశిల్లుచుండు. ఈవికారంబు లాతని నంటునవి గావు. ఆత్మజ్ఞానంబు లేని మూఢాత్ములు దేహాత్మబుద్ధిచే నుపాధినాశంబ యాత్మనాశం బని శోకించుచుందురు. తల్లీ ! నీ వీ విశేషంబు లెఱుంగనిదానవు గావు. ప్రాకృతజనంబువలె జ్ఞానవతీ మతల్లివగు నీ వింత మాత్రమున కిట్లు పరితపింపఁ జెల్లదు.

కుంతి.—నాయనా ! నీకుఁ గల జ్ఞానంబు వర్ణనీయం బనుటకు సందియము లేదు. కాని దృఢ బద్ధంబగు ప్రేమబంధంబు నన్నా మార్గంబునకుఁ దిరుగనీయకున్నది. తండ్రీ! నా గర్భంబు పుత్రశోక పాత్రంబు కానీయకుము.

కర్ణ.—తల్లీ ! నీ వింక నట్టి యాశ పెట్టుకొనకుము. నే నా దుర్యోధను నిమిత్తము నీ పుత్రులతోఁ బెనంగుచునను మాట నిక్కము.

కుంతి.— [సింహరేఖావృత్తము.]

ఏటికింత చేసె దీవి ? మాట పాటి సేయు మన్నా

కర్ణ.—మాటిమాటి కిట్లు నాకీ ? మాటఁ జెప్పఁ బోకు మమ్మా.

కుంతి.—నిన్నుఁ గానకున్న నే నో ? కన్నతండ్రి నిల్వఁ జాలన్

కర్ణ.—కన్ననాఁడు లేని ప్రేమం ? బెన్నఁడైనఁ గల్గు నమ్మా.

కుంతి.—దెప్ప నేల తల్లి నిట్లా ? తప్పు నైఁపు మిప్పు డన్నా

కర్ణ.—తప్పు లేదు తల్లి నీపై ? నొప్పు దేను రాజు నన్నన్.

కుంతి.—నాయనా ! నీ వింక నా మాట వినవు నా కొక్క వర మీయుము నే నేగెద.

కర్ణ.—మాతా ! నీ యాంతర్యము నే నెఱింగితి.

ఉ. దీనులు నీ కుమారులు యుధిష్ఠిర ముఖ్యులు నల్వు రెందునన్
గూనలు వారు చేపడినఁ గూడ వధింపను గాని యెన్నఁడున్
మానను సవ్యసాచి పయి మాత్రము కోపము నాకు నిక్క మీ
పైన నతండు నాదరికి నచ్చినఁ జచ్చె నటంచు నెంచుమా.

కాదేని వానిచేత నేను గూలుటయు నాకుఁ బ్రతిష్ఠాకరంబ.

కం. ఆతనిచే నేనో నా
చేత నతండో శమింపఁ జివరకుఁ గుంతీ
సూతు లయిదుగురు గానీ
మాతా నీ వార్లు రనెడి మాట మఱవుమా.

కుంతి—నాయనా! కార్యక్రమంబుపూర్వకర్మానుసారంబుగాఁ బ్రవర్తిల్లుచుండు. దానిం దప్పింప బ్రహ్మకైనం దరము గాదు. నీ వాడిన మాట మఱవకు మాపైన విధియెట్లున్నదో యది కాకమానదు.

కర్ణ—తల్లీ! నీ మనోరథంబు విఫలంబు కానేరదు పొమ్ము.

కుంతి—(కన్నీరుతో) కుమారా! మరల నిన్నుఁ జూచెడిభాగ్యమున్నదో? లేదో? (నిష్క్రమించుచున్నది.)

కర్ణ—ఈ యైశ్వర్యము లన్నియు నశ్వరములు జలబుద్బుదము వంటి దీ ప్రాణము మాత్రము శాశ్వతమా?

ఉ. తల్లి వచించుఁ గాక మఱి దైవము చెప్పెడుఁ గాక కంఠమే
త్రెళ్ళినఁ ద్రెళ్ళుఁ గాక జగతీతలమందుఁ గృతఘ్నబుద్ధి నా
కొల్లదు ధర్మమున్ విడువ నొల్లదు నా మది సాహసంబు పో
నొల్లదు దైవయోగ మెటు లుండిన నేమి భయంబు నాకిఁకన్.

మాశకుని సుయోధన దుశ్శాసనులు నాకెదురుచూచుచుందురు నే నింక నేగవలయు. (నిష్క్రమించుచున్నాఁడు.)

షష్ఠాంకము.





# కృష్ణసందేశము.

## సప్తమాంకము.

### విష్కంభము.

[భీమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఉ. ఎన్నఁటి కింకఁ దీరు మద । భీష్టము చేతుల తీట వోవ మా
కెన్నఁటి కబ్బు యుద్ధ మిఁక । నెన్నఁటి కీపరితాప మాఱు నిం
కెన్నఁటి కేగుదెంచి వసి । యించు భుజంబున రాజ్యలక్ష్మి తా
నిన్నఁటి కేమి చేసికొని । కృష్ణుఁడు వచ్చునొకో రయంబునన్.

వాసుదేవుండు హాస్తినాపురంబున కేగినది మొదలు నా కీచింతచే నిద్ర పట్టకున్నది. ఒకవేళ సంధి నిశ్చయింపఁబడిన మా క్రోధము లన్నియుఁ జవుటనేలం జల్లిన విత్తనము లట్లు నిష్ఫలములు కావలసి యున్నవి కదా? దైవ మెట్లు చేయ నున్నాఁడో? యిప్పుడు వారితోఁ గలసి మెలసి వర్తించుట కంటె నే యరణ్యమందైన మరల మొగ మెత్తుకొని నిర్భయంబుగాఁ గాలంబుఁ గడపికొనుటయే నాకుఁ దలవంపు లేని పనిగాఁ దోఁచుచున్నది. మా యన్నదమ్ము లీయెడ నేమి యాలోచించుచున్నారో? వారి కడ కేగ వలయు.

(నిష్క్రమించుచున్నాఁడు.)



—◆ ఉపప్లావ్యము. ◆—

[ధర్మ భీమార్జున నకుల సహదేవులు ప్రవేశింతురు.]

ధర్మ—(విచారముతో.)

ఉ. సాయము సేయ నెంచి కురు । సభ్యుల సన్నిధి కేగుదెంచి నా
రాయణమూర్తి యింతకును । రాఁడు దురాత్ములు వార లేవిధిన్
జేయఁ దలంచిరో మనము । చేసిన పుణ్యము లెట్టు లున్నవో
శ్రేయము గల్గునో తుదకుఁ । జేకుఱునో విపరీత మర్జునా.

అర్జు—అన్నయ్యా! యేది యెట్లైనను సర్వలోక బాంధవుండగు గోవిందుని యానతి మన కతిక్రమింపరానిది.

ధర్మ—మన కమ్మహాత్ము నుపదేశము కన్న మిన్న యగు మార్గ మేమున్నది?

సహ—(ఆలకించి) అన్నయ్యా! పురుషోత్తముని రథ ధ్వానము వినవచ్చుచున్నది.

[శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ధర్మ—కృష్ణా! నీ పునరాగమనము వలనఁ బరమప్రమోద మగుచున్నది. ఈ యాసన మధిష్ఠింపుము.

కృష్ణ—బావా! మన మందఱము కూర్చుందము.

(అందఱు కూర్చుందురు.)

ధర్మ—కృష్ణా! భవదీయ వచనామృతంబున కస్మదీయ శ్రవణ చకోరంబు లెదురు చూచుచున్నవి.

కృష్ణ—బావా! నీ మనోరథమునకు భంగము రారాదను పట్టుదలతో నే నా కౌరవ సభా మధ్యంబున ననేక విధంబులఁ గార్యంబు నడప నెంచితిఁ గాని కార్యంబు లేదయ్యె. మొదటఁ గురు వృద్ధుండగు ధృతరాష్ట్రునకుఁ జెప్ప వలసిన సంగతు లన్నియుఁ బూస గ్రుచ్చినట్లు చెప్పితి. పిదప నా దుర్యోధనునకు నాశక్తి కొలఁదియు

సామంబున బోధించితి. నయంబునఁ జెప్పితి. రోషంబునఁ దర్జించితి. దానికాతండు చీదరించుకొని మర్యాద నెఱుంగని ప్రత్యుత్తరంబొసంగె.

ధర్మ—కృష్ణా ! దానికి మా తండ్రియుఁ బెద్ద లెల్లరు నేమియు ననకుండిరే ?

కృష్ణ—గుణజ్ఞులగు వా రేటికి ననకుందురు ?

సీ. పాండునందనులతోఁ ♦ బొండుకుండిన నీకుఁ
బ్రాణ ముండ దటంచు ♦ ద్రోణుఁ డనియె
ధర్మంబుఁ దప్పిన ♦ దుర్మదాంధుల కల్మి
పెంపుఁ జెంద దటంచు ♦ భీష్ముఁ డనియె
పరిభవం బగు నీకు ♦ దురభిమానం బింక
వదలిపెట్టు మటంచు ♦ విదురుఁ డనియె
ధాత్రిలోఁ జీవించి ♦ పుత్రశోకము నేను
మోయ నేనంచాంబి ♦ కేయుఁ డనియె

గీ. తలఁ దు నీకిది యని జామ ♦ దగ్న్యుఁ డనియెఁ
గలుగు నాశంబు నీకని ♦ కణ్వుఁ డనియెఁ
బాగగు పని సేయు మని బ్రహ్మ ♦ పుత్రుఁ డనియె
నన్నియును గూడ వ్యర్థము ♦ లయ్యెఁ బుదకు.

మీతండ్రి ధృతరాష్ట్రుఁడు తనపై భార మేదియు లేనట్లు నటించుంచి పుత్రునకు బుద్ధులు చెప్పఁ జాలక నన్నర్థింప నే నాతని మాట త్రోసి వేయఁ జాలక.

ఉ. చెప్పితి సంధివాక్యములు ♦ చెప్పితి ధర్మము లెన్ని యేని యా
తప్పుడు ధార్తరాష్ట్రుని వి ♦ ధం బది చూడఁగఁ జావ నైనఁ దా
నొప్పెను గాని సంధి యన ♦ నొప్పక నిప్పులు ద్రొక్కె నింక మే
లొప్పదు మీకు నారిగొన ♦ నొప్పవు యుద్ధముతప్ప నెప్పనుల్.

భీమ.—(మురియుచున్నాఁడు)

అర్జు—(పైనఁజూచుచున్నాఁడు)

నకు—(నవ్వుచున్నాఁడు)

సహ—(తలయూఁచుచున్నాఁడు)

కృష్ణ—బావా! వాఁడు నన్నెట్లని కట్టివేయవలయు నను ప్రయత్నంబుతోఁ గర్ణశకునిదుశ్శాసనుల చేయూఁత నాధారము చేసికొని నాపైకి వచ్చెను.

ధర్మ—ఆదురాత్ముఁ డెంతపనికిఁ బాల్పడినాఁడు?

భీమ—వాని నాశమున కిది ప్రథమసోపానము.

అర్జు—ఆదుర్మార్గు నప్పుడే యడఁగఁద్రొక్కక పోతివా?

కృష్ణ.—అప్పుడు నా యమానుషంబగు ప్రభావముం జూపి తప్పించుకొని వచ్చితి. బావా! మీకింక వారియెడ సామదానభేదో పాయంబులు కార్యంబు సేయ నొల్లవు. మఱియు మీతల్లి కుంతీదేవి క్షాత్రజీవనంబున బ్రతుకుండని మీకుఁ జెప్పు మనినది.

ధర్మ—కురుకులాంతకా! దుర్యోధనా! యెంతపనిచేసితివిరా? మేము నీయెడఁ జేసిన మేలు జ్ఞప్తిలో లేకున్నను నేఁడు మాయెడ నొనర్చిన కైతవ్యనం దలంచికొని కొంచమువిచారింపనైతివే? గోత్రహా! నీ వా సభలో మా పట్టమహిషికిం జేసిన యవమానముం జూచియు సహించియున్నందుకైనను మాపైన నీకుఁ గరుణ గలుగదాయెనే? కఠినాత్మా! నీవు చేసిన సమయంబు పరిపాలించి యరుదెంచిన మమ్మిట్లు పరిభవింప నెంచితివే? దుర్మతీ! క్షత్రియవంశంబునం బుట్టి పరాక్రమవంతులమగు మేము ధర్మప్రకారంబున నిన్నుపేక్షించితిమని యైనను గౌరవము లేదాయెనే?

ఉ. శ్రేణులు గట్టి యుండు కురు సేనలతోడ ననేకసంశ్రిత
ప్రాణులతోడఁ బుత్రహిత బంధుజనంబులతోడ నిత్యక
ళ్యాణము పచ్చతోరణము నయ్యెడు కౌరవవంశ మెల్ల ని
ర్యాణము నొంద వేరుపురు గైతివిరా ధృతరాష్ట్రనందనా!

నిన్ననిన లాభ మేమున్నది? లోభదూషితంబగు నీస్వాంతంబు నిన్నట్లు త్రిప్పుచున్నది. అదియుంగాక నీ పూర్వజన్మ దుష్కృత పరిపాకంబు నీకట్టి బుద్ధిం గల్పించుచున్నది. (విచారముతో) ఆహా! లోకోన్నతిం గాంచిన భరతవంశంబున కెట్టి పాటు సంప్రాప్తించినది? (ధైర్యముతో) ఈ విచారమింకఁగూడదు. భగవంతుండు నియోగించిన కార్యంబు సర్వథా గ్రాహ్యంబు. తమ్ముఁడా! భీమసేనా!

మ. సమర క్ష్మాతలమందు బంధుజననాశంబొల్లమిక్ నాదు స్వాం
తము సంగ్రామమునంగ డీకొనక యిన్నాళ్ళున్న దీ కృష్ణు వా
క్యము విన్నప్పటినుండి మారినది..........................
భీమ—(సంరంభముతో).........అన్నా! యట్టులేనైన మా
శత్రులుం దీఱినవంచు నెంచు మిఁక..........................
(ఆవేశముతో) ................పార్థా! గాండీవం బేదిరా.

అర్జు—నేఁటికి సుయోధనుండు మాపాలిటికి మిత్రుండు గాక శత్రుం డయ్యెనే? కాఁడు కాఁడు మిత్రుండని ముమ్మాటికి సంతసింప వలసియున్నది. ద్రౌపదీపరాభవముం దలంచుకొని భగ్గు భగ్గున మండుచుండు నస్మన్మనో వహ్ని కుండంబుల కాహుతి నొసంగెడి మహానుభావుండు మాకెల్ల రకుం బూజ్యుండనుటకు సందియంబులేదు.

(గాండీవమెత్తికొని)

మ. ఒకచోటన్ బడి యుండి యుండి తనును ద్యోగంబుఁజాలించి చా
వకయుం జచ్చిన దాన వైతి వకటా వైరంబు సాధింప నే

రకయో యవ్విధి దాఁట నేరకయుఁ జిత్రంబయ్యె నిందాఁక నీ
విఁక నైనన్ గను లెత్తు గాండివమతల్లీ! నీకు దీర్ఘాయువౌ.

నకు—దైవయోగము సమకూరు నప్పటికి బుద్ధు లన్నియు నేకీభవింపఁగలవు. కార్యసాఫల్యమున నైకమత్యము ప్రధానము. ఐకమత్యములేనినాఁడు కార్యభంగంబువాటిల్లుననినిశ్చయింపఁబడవలయు అన్నగారి మతియునిప్పటికి సమపథంబునకువచ్చినది. వాసుదేవాజ్ఞానుసరణంబు విజయసూచకంబగుచున్నయది. (ఖడ్గమెత్తి)

ఉ. ఆహవ మెప్పు డబ్బుఁ బరిహాస మొనర్చిన ధార్తరాష్ట్రసం
దోహము నెప్పు డందుకొనఁ దూఁకుదు నంచుఁ గడంగుచుండు నీ
సాహసవృత్తికిన్ ఫలము సంధిలెఁ గౌరవవంశ మెల్లఁ బూ
ర్ణాహుతి సేయు మింకసెలవయ్యెఁ జలింపకుమమ్మ ఖడ్గమా.

సహ—మంత్రౌషధిప్రభావంబున నరికట్టంబడిన కాకోదరంబుల చందంబున నిర్వీర్యులమగు మాశక్తి దలంచుకొనిన నాకిపుడు పరిహాస మగుచున్నది. దుర్బలుండగు చిత్రరథునిచే బంధింపఁబడి దిక్కులేక పరితపించిన యా కురుకులపాంసనుండా? మమ్ముఁ బరాభవించెడి వాఁడు. ఆహా! గజంబులు మశకంబులగు కాలముగూడఁ జూడనయ్యె. ఆ కాలచక్రము మాత్రము మాఱుచుండదా? (బాహువులెత్తి)

మ. చిరకాలంబుననుండి కౌరవపురులన్ సేవించి సేవించి గ్రి
చ్చఱ నీచేయుతపంబు పండె ననుకొమ్మా నెత్తురుల్ కాల్వలై
వఱదల్ గట్టఁగ వైరిశీర్షములు దుర్రిపంగల్గ కాలంబు దా
పరమయ్యెన్ మన కింకనో భుజయుగంబా మేలుకో మేలుకో

భీమ—అబ్బబ్బా? తబ్బిబ్బులాడినహృదయంబా! నిబ్బరింపుము నిబ్బరింపుము. కాలచక్రవక్రత్వముం బట్టి బ్రహ్మ తిమ్మ యగుచుండు. తిమ్మ బ్రహ్మ యగుచుండు. జాజ్వల్యమానంబగు మత్క్రోధాగ్ని

హోత్రావేగంబు నివారించుట కిప్పట్లు నా కధికారము చాలకున్నది. సముద్దండ భుజాదండ మండితం బగు నా గదాదండంబు సంగర రంగ మండలంబునఁ దీండ్రించు భాగ్యం బెప్పటి కబ్బునా? యని చింతిల్లుచుండ దైవయోగంబువలన (నిట్టూర్పుతో.)

మ. సభలో మా తరుణీమణిం గదిసి కైశ్యం బీడ్చు నద్దానికిన్
బ్రభులై కైతవ మల్లి తొల్లి మముఁ జంపం జూచు నద్దానికిన్
శుభవృత్తిం దొలఁగించి మమ్మడవులందుం ద్రోయు నద్దానికిన్
లభియించెన్ సహియించి యుండ ఫలకాలం బద్దిరా నేఁటికిన్.

ధర్మ—తమ్ముఁడా! భీమసేనా! వారియెడ నెన్నియపచారములుండినను హింసా భయము నన్నుముందంజ వేయనీయకున్నది.

భీమ—అన్నా! ధర్మజా! నీకట్టి సంశయం బున్న యెడ.

ఉ. చేసవరింపనీక కురుసేనల నొక్క గదాప్రహార వి
న్యాసమునం గలంచి దురితాత్ములలోపల మేటియైన దు
శ్శాసను నొంచి దుర్వినయశాలి సుయోధను గీటడంచి సం
తోసముతోడ నీకు జయతోరణముం గట్టెద నాజ్ఞ నీయుమా.

అర్జు—అన్నా! పాండుకులప్రదీపా! నీవిమాత్రమున కేల విచారించెదవు.

ఉ. ఈయెడ నాజ్ఞ నియ్యుము మహీతలమెల్ల వడంకునట్లు రా
ధేయుని సంగరంబున వధించి బలంబుల నెల్ల నొంచి నీ
కాయ మొకింతయేని కసుగందఁగనీయక నే నొకండ న
త్యాయతమైన భూవలయమంతకు నిన్నధినాథుఁ జేసెదన్.

నకు—అన్నయ్యా! ఈ యహింసా ధర్మమున కించుకేని లోపము రానీరము.

ఉ. క్షత్రియవంశ యోగ్యమగు । ఖడ్గముఁ జేత ధరించి విద్విష
ద్గాత్రము లెల్ల ఝల్లుమని । కంపము నొందుచునుండ న
క్షేత్రమునందు నిల్చి రణ । క్షేత్రి నొనర్చెద నిందతేల సా
ర్వత్రికమైన తాపక కృ । పారస మింత యనుగ్రహింపుమ

సహ—అన్నయ్యా! కౌరవులు మనయెడఁ జేసిన
చారములకుఁ బ్రతిక్రియాసమయము తటస్థించినది. నీకిందిం
శ్రమం బక్కఱలేదు.

ఉ. క్షేమవిదుండు బావ పరి । కించుచు నుండ నశేష సైనిక
స్తోమము గుండె ఝల్లుమని । చూచుచునుండ నఖండమైన
గ్రామమునందు మార్కొనెడి । రాజుల నెల్ల నొకండ నేను
ర్మాములఁ జేసి పూజ్యమగు । రాజ్యము నీ భుజమందు నిల్పె

ధర్మ—కృష్ణా! యెవరెన్ని చెప్పినను నా మనంబు కు
క్షయంబునకు వెనుకడుగు వేయుచున్నది. నే నేమి చేయుదు.

కృష్ణ—బావా! నీహృదయమున ధైర్య స్థైర్యములఁ
కొల్పుము. మీ పూర్వ రాజన్యుల శౌర్యముం దలంచికొనుము
తల్లి వచనంబులు మరల నొకసారి స్మరించుకొనుము. అఖండభూ
లాధిపతియగు పాండు మహీపతి నందనుల దీనస్థితి నాలోకింపుఁ

ఉ. తెంపుము ప్రేమబంధము న । గింపుము దుష్టుల నెల్ల మేఁ
వింపుము భూజనంబులకు । వీనుల కింపు జనింపఁ గీర్తి నా
ర్జింపుము ధర్మరక్షణమున । రింపుము తమ్ముల సౌఖ్యమేని
చింపుము నీ విచారము త్య । జింపుము పొమ్ము శుభమ్ము నీక

ధర్మ—కృష్ణా! నాహృదయమునకు విశ్రాంతి గలుగకు

కృష్ణ—కౌంతేయా! కర్తృత్వాద్యభిమానహేతు
ప్రాకృతుండువలె నీ వెంత భ్రాంతిలోఁ బడిపోవుచున్నాఁడవు?
కారుండును నచ్ఛేద్యుండును నిత్యుండును నిర్మలుండు నగు

కెన్నటికిని నాశంబు లేదు. మహాత్ము లుపాధిభేదంబున సర్వభూతాంతర్యామియు నద్వితీయుండునగు నాత్మకు భేదంబు గల్పించుకొని యుపాధిధ్వంసంబ యాత్మధ్వంసముగ దుఃఖావిష్టులగుచుందురు కాని యాత్మవిచారంబుఁ గావించెడి జ్ఞానులు స్వాభావికమగు నుపాధినాశమున కిసుమంతయేని? శోకింపరు ధర్మజా! నీవీ తత్వం బెఱింగి నిర్విచారుండ వగుము.

ధర్మ—దేవా! యిప్పటికి నా హృదయము శాంతించినది నేను కృతార్థుండనైతి.

కృష్ణ—ధర్మనందనా! నే నిందు మీకుఁ జేయవలసినసాహాయ్యమున్న యెడఁ గోరుము.

ధర్మ—(దోసిలొగ్గి) దేవదేవా! నీయనుగ్రహంబుకన్న మాకుఁ గావలసిన దేమున్నది.

(భరతవాక్యము)

ఉ. న్యాయము నిల్పుఁ గాక భువనమ్మున నెల్లరకు౯ విశేష దీ
ర్ఘాయువు గల్గుఁ గాక నిరపాయముగా జగతీతలంబు శ్వ
శ్శ్రేయస మొందుఁ గాక విపరీతము లెల్లఁ దొలంగుఁ గాక ని
ర్మాయికమైన వృత్తము కరమ్మున దిగ్జయమొందుఁగావుత౯.

గద్య. శ్రీమత్పరమ పవిత్ర భారద్వాజస గోత్రాపస్తంబసూత్ర
యజుశ్శాఖాపాత్ర సీతారామ పుత్ర కనకాంబా గర్భ
శుక్తి ముక్తాఫల పరమేశ్వర ప్రసాద సముపలబ్ధ
ఘటికాశత గ్రంథికవనసామ్రాజ్య చిదంబర
కవీంద్ర ప్రణీత శ్రీకృష్ణసందేశము.

సప్తమాంకము.